తి తీవ్రాలు, ఉత్తరాంగంలో దనిలు అతికోమలాలు. ఈ చాలా సాధన చేయాలి.

ఉత్తరాంగం కనకాంగి స్వరాలు ఈ మేళంరాగం కాదు వాది మయం. పూర్వాంగంలో రి, ఉత్తరాంగలో ని, అంటే సాధారణ గాంధారమే, సాధారణగాంధారం, ం వరుస స్వరాలు కనుకనే పాడటం కష్టం.ఉత్తరాంగంలో ుశృతిరిషభమై వరుసగా శుద్ధధైవతం, చతుశృతిధైవతాన్ని వివాదిరాగంలో సంగీతవిలువలు తక్కువ ఉంటాయి. వివాదిత్వం అంటే ఆదీ అర్ధం.

యంలో ఈరాగానికి కలావతిఅని పేరు. మూర్ఛన దపమరిగమరిన రాగాంగం. సంపూర్ణం, షడ్జగ్రహం, గును.

వ ఝంప వెంకటముఖి

ఖవతీ ఆది దీక్షితర్
ామదీక్షితర్ ఇది మూర్ఛనకారకమేళం కాదు.

ఈ గ్రంథ ముద్రణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు
దయతో ధన సహాయము నొనర్చిరి.

వారికి నా కృతజ్ఞతా వందనములర్పించుకొనుచున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు:
నూకల చిన్న సత్యనారాయణ

# దర్బారు.

దర్బారు 22వ మేళకర్త ఖరహరప్రియ జన్యం. ఉపాంగరాగం రక్తిరాగం, వీర రసప్రధానమైనరాగం పురుషరాగం.

స్వరస్థానములు స,ప, లు గాక, చరి, సాగా, శుమ, చద్రై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

మూర్ఛన

ఆరోహణ స రి మ ప ద ని సా

అవరోహణ స ని స ద ప మ రి గా రి స

దర్బారు, నాయకి రాగాలు కవల రాగాలు దర్బారు పురుషరాగం వీరరసం, నాయకి స్త్రీరాగం. కోమలంగా ఉంది, శృంగారరసప్రధానరాగం.

షాడవ, వక్ర సంపూర్ణరాగం, వర్జ్యరాగం. ఆరోహణయందు 'గ' లేదు. కర్ణాటక శుద్ధమైన రాగం.

నీనీదప గాగారిస అన్యప్రయోగాలు రాగరంజకాలు

నీనీదప । అనునప్పుడు దనదా దసదస దప,
గాగారి స అనునప్పుడు రిమరీ రిమరిమ రిస అని పలుకుతుంది

ఇందలి గాంధారాన్ని దర్బారు గాంధారం అంటారు. నిషాధాన్ని కూడా దర్బారు నిషాదం అనవచ్చు.

ఈ రెండు కంపిత గమకాల్లు, ఇంకొక విశేషం ఏమిటంటే గాగారిస అనునప్పుడు కంపిత గమకం రిషభ మధ్యమాలయందు ఒక నిర్దిష్టలయయందు కంపిస్తూ, గాంధార స్థానాన్ని తగలదు. అలాగే నిషాధంకూడా. అంటే గాంధారంలో గాంధారం గాని, రిషభంలో రిషభంగాని లేక పోయినా ఈకంపించినప్పుడు గాంధారనిషాధాల ఛాయలు, శ్రోతలకు తోచేటట్లు చేస్తాయి. (భ్రమనుకలుగచేస్తాయి) (illusion) నిజానికి గమకం

ముఖ్యం. స్వరం ప్రాతిపదికమాత్రమే. రాగస్వరూపం ముఖ్యం. గాంధార నిషాదాలు దీర్ఘాలుగా గమకంగా పైవిధంగా పాడక, ఖరహరప్రియలో లాగా లేక హిందోళలాగానూ, పాడితే దర్బారు రాగస్వరూపానికి భంగం చేకూరుతుంది. కర్ణాటకసంప్రదాయంలో ఇట్లాంటి విశేషాలు ప్రత్యేకాలు అనేకంగా ఉన్నాయి.

రాగాలాపన మొదలైన మనోధర్మసంగీత శాఖలు పాడటానికి అనుకూలమైన రాగం. ఎక్కువ సేపు బాగుండదు. తగుమాత్రంగా బాగుంటుంది. చిన్నరాగం అయినా ఆకర్షణ కలిగిన రాగం.

దర్బారురాగంలో తానవర్ణం దర్బారురాగానికి లక్షణ లక్ష్య రచన. దర్బారు వర్ణాన్ని పాడితే రాగం అవగాహన అవుతుంది.

జీవస్వరాలు గ,ని
వాదిస్వరాలు గ,ని
గ్రహన్యాసస్వరాలు స,రి,ప,ద,
గ నిలు గ్రహన్యాసాలు కావు.

ఈ రాగనిడివి మంద్రపంచమం నుండి తారపంచమం వరకు గలదు.
ప̣ధ̣ని̣సరిమపదనిసారిమపా ।

పమరిగాగారిస̣ । నిస̣దపమరి । సాసారిసనిసదపదనిసా ।

ఉదయరాగం. అయిననూ ఎల్లవేళలా పాడవచ్చును.

సంక్షిప్తరాగాలాపన

స̣ా । రీపమరీగాగారిస̣రీస̣ా । రిసనిసాప̣ । ధ̣ని̣సరీ । రీపమాదపమరీ। గాగారీసరీసా । రిసారీపమపా । మపదనిసాపా పదనీపా । దదపమ పపమరిగగరిస । రిసని̣సా । రిమపదనీసా । సానిరిసనిస। దప । మపదనిసరీసానిసా । పాదనిసరీరీస్గరిగాగారిసరి। రిపమరీగాగారిసరిసా। రిసని̣స̣ధ̣ప̣ । మ̣ప̣ధ̣ని̣సాపా । పదనీసపా మదపమరీ గాగారిసరీ । రిసని̣సా ప̣ధ̣ని̣సరీ। రిసని̣స̣ా।

రచనలు

1. ఆదితాళ వర్ణం.
2. యోచన ఆది త్యాగరాజు
3. ముందువెనుక " "
4. రామభిరామ చాపు "

# దివ్యమణి (జీవంతికా)

దివ్యమణి 48వ మేళం 8వవను చక్రంలో 6.వరాగం 'ష' ప్రస్తారం. సంపూర్ణం వివాదిరాగం.

స్వరస్థానాలు. స, ప, గాక, శురి, సాగా, ప్రమ, షధై, కాని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | గ | . | . | మ | ప | . | . | ద | ని | స |

పూర్వాంగం(సరిగమప) శుభపంతువరాళిస్వరాలు.

ఉత్తరాంగం లేక పదనిస నాటస్వరాలు.

ష ధై ఉండుటచేత ఇది వివాది రాగం అయింది.

పూర్వాంగం ఉత్తరాంగం స్వరాలు కలిపి పాడాలి. పదప । నిసరిగరిస । అని షధై, కా ఖి విడదీసి, పాడాలి.

వేంకటముఖి సంప్రదాయంలో ఈ రాగం 'జీవంతికా' రాగం, సంపూర్ణం, షడ్జ గ్రహం,

మూర్ఛన

ఆరోహణ స రి గ మ ప ద ని స

అవరోహణ స ని ప మ గ రి స

అవరోహణ యందు ధైవతం వర్జ్యం, ఎల్లప్పుడును గానము సేయదగును.

రచనలు

1.లక్ష్యగీతం క్షీరాబ్ధికన్యే త్రిపుట వేంకటముఖి.

2.కృతి - బృహదీశకటేక్షణ. ముద్దుస్వామిదీక్షితర్.

3. సంచారి మర్త్య సుబ్బరాయదీక్షితర్

జన్యరాగ మూర్ఛనలు.

1. జీవంతిని - స్మపదనిస | సనిపమగస
2. శుద్ధగాంధారి - స్రిగమనిస | సనిదనిప మ రిస
3. అమృతపంచమం - స్రిగమదనిస | సనిదమగరిస
4. ఆదిపంచమం - స్రిపదనిస | సనిదనిపమగరిస
5. కుంతలదీపకము - స్మపదనిస | సనిదనిపమగస.

# దీపకం

దీపకం 51వ మేళకర్త కామవర్ధని జన్యం
ఆరోహణ-స గ మ ప ద ప స
అవరోహణ-స ని ద ని ప మ గ రి స

స్వరస్థానాలు  స, ప, గాక, శురి, అంగా, ప్రమ, శుధై, కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | . | మ | ప | ద | . | . | ని | స |

ఉపాంగరాగం, అపూర్వరాగం వక్రఔడవ వక్రసంపూర్ణం. ఈరాగం త్యాగరాజస్వామి వారి సృష్టియే. ఈరాగమున ఇతర వాగ్గేయకారుల రచనలు కనిపించుటలేదు.

'కళలనేర్చిన' అను త్యాగరాజువారి కృతి యందు గల నడకలు, ప్రయోగములను బట్టి, మూర్ఛనను బట్టియును రాగామును ఏర్పరచుకొని పాడవలెను. రాగము స్వరకల్పన మితముగా పాడవచ్చును.

సంక్షిప్తరాగాలాపన.

సా । సగమపామగరిసా । సనిదనీ పదపసా । గమపా । పదపపాసా ।
సనిదని । పదపపసా । సనిదనీ పదపమగమగా । పమగరీసా । సగమపా ।
దపసా । సాగామాపా । పామగరీసా । సనిదా । నిపా । మపదపదాపసా ।
సనిదానీపా । పమగమగరిస । సనిదనీపా । దపసా । .

కృతి

కళలనేర్చిన ఆది త్యాగరాజస్వామి.

# ద్విజావంతి

ద్విజావంతి 28వ మేళకర్త హరికాంభోజి జన్యం.

ఆరో స రి గ మ ప ద ని స

అవ సే ని ద ని ద ప మ గ రి గ రి స ని ధ ప రి స

స్వరస్థానాలు స.ప,గాక, చరి, అంగా శుమ, చద్రై, కైని, (సాగాఅన్యస్వరం)

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | గ | మ | . | ప | . | ద | ని | . | స |

భాషాంగరాగం, అపూర్వరాగం, ఔత్తరాహికరాగం. దేశీరాగం. దీక్షితర్ ఈరాగాన్ని హిందూస్థానీ సంగీతం నుండి కకర్ణాటకసంగీతంలోకి కి చొప్పించారు ఈరాగంలో త్యాగరాజస్వామి గాని, శ్యామశాస్త్రి వారు గాని రచనలు చేయలేదని తెలుస్తూంది.

ఆధునిక యుగంలో ద్విజావంతిరాగం కర్ణాటక సంగీతంలో ఒకభాగంగా అయి కర్ణాటకరాగం అయింది. ఈ ద్విజావంతి రాగాన్ని ఔత్తరాహిక సంగీత విద్వాంసులు "జైజైవంతి" అని వాడతారు. మనోధర్మసంగీత శాఖలు విజృంభించి, ఎక్కువసేపు పాడటానికి వీలులేదు. చిన్నరాగం. ఈవిధమైనరాగాలు వాటియందుండు ప్రసిద్ధమైన, రసవంతమైన కృతులమీద ఆధారపడి, వాటిద్వారా ప్రకాశిస్తో ఉంటాయి. అన్యస్వరమైన సాధారణగాంధారం మూర్ఛనలోనే ఉంది. ఆస్వరమే జీవస్వరం.

సంక్షిప్తరాగాలాపన.

స్థా । రిగమపమగమాగరీగారిసా । ససనిధప । రీ । రిరిగాసా । సానిధనిరీ ।
రిగమగారీ । రిగాస । రిగమపా । రీగమాదపపా । మానిదానీసా ।
సేనిదపరీరీ । రిగమగారిరీ । రిగాసా । సానినిదప । రీ;; సా । రిగమాగగారి
రిగారీసా । సారిస నీదాదపా । పాదపమగగారరీ । రిగమప మగమగ రీగారిసాని ।
ధనిరీ । రిగారీసా ।

రచనలు

చేత శ్రీబాలకృష్ణం రూపకం దీక్షితర్

అఖిలాండేశ్వరి ఆది దీక్షితర్

# దుందుభి

దుందుభి 48వ మేళకర్త దివ్యమణి జన్యం

ఆరోహణ స రి గ మ ప ద ని స

అవరోహణ స ని ప మ గ రి స

స్వరస్థానాలు స.ప,గాక, శురి, సాగా, ప్రమ, షద్రై, కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | గ | . | . | మ | ప | . | . | ద | ని | స |

ఉపాంగరాగం అపూర్వరాగం. షద్రై ఉంది కనుక, వివాదిరాగం. సంపూర్ణ జౌడవ రాగం.

ఈ రాగమునందు ఇతర వాగ్గేయ కారులరచనలు కానవచ్చుట లేదు. ఈ రాగము త్యాగరాజస్వామి వారి సృష్టియే కావచ్చును.

సంక్షిప్తరాగాలాపన :–

స్థా । సరిగారిసనిప । ధనిసా । నిరిగారి । గమపా । దపమ పదనిసనిసపమగారిగమపాదప పమగారిసా । సనిగారి । గమపా । గమపదనిసా ।
పదనిసారి । సరిగామాగారిసానసనిపదనిసా । నిపమ । పాదపమపాదనిపా । మపదనిసారిస సా నిపా । దదపామ । గా గమపదపమగారి రిసాసాని సారిససనిపా ।
పధనిసా । సనిసరిగారిసా । .

'ను జూచే కులశీలుల ఆది త్యాగయ్య.

# దేవక్రియ

దేవక్రియ 22 ఖరహరప్రియ జన్యం.

మూర్ఛన
ఆరోహణ - స రి గ రి మ ప ద ప ని స
అవరోహణ - స ని ద ని ప మ గ రి స

స్వరస్థానాలు స.ప, గాక, చర్రి, సాగా, శుమ, చధై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగరాగం అపూర్వరాగం ఉభయవక్ర సంపూర్ణరాగం. ఈరాగం త్యాగరాజస్వామి వారు సృష్టించిన శతరాగ రత్నమాలికలో ఒకటి.

ఈ దేవక్రియ పేరుతో వేంకటమఖివారి సంప్రదాయంలో ఇంకొక రాగం ఉంది ఆ రాగం శుద్ధసావేరి. వేంకటముఖి వారి సంప్రదాయంలోనే శుద్ధసావేరి అని మరి యొక రాగం కలదు. మూర్ఛన సరిమపదస /సదపమరిస. కాని రిషభధైవతాలు శుద్ధాలుగా ఉంటాయి.

గ్రహస్వరాలు స

వాదిస్వరాలు స, ప, మ, రి, గ, ద, ని

జీవస్వరాలు అన్నిస్వరాలు జీవస్వరాలే,

వక్రం కనుక రాగం, స్వరకల్పన, కష్టం.

రచన
చిన్ననాటిమాట మరచితివో ఆది త్యాగయ్య.

# దేవమనోహరి

దేవమనోహరి 28వ మేళకర్త హరికాంభోజి జన్యం

మూర్ఛన

ఆరోహణ - స రి మ ప ద ని సా

అవరోహణ-స ని ద ని ప మ రి సా

స్వరస్థానాలు స, ప, గాక, చరి, శుమ, చధై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | . | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగం, వర్జ్యరాగం ఆరోహణలోనూ అవరోహణలోనూ 'గ' లేదు. షాడవ వక్ర షాడవం

వాది స

సంవాదులు స - ప ; రి - ప ; రి - ద ; మ - ని ; మ - స ; ప-స ;

జీవస్వరాలు స,మ,ని.

గ్రహ న్యాసాదులు, స,రి,మ,ప,ద,ని. శృంగార రసప్రధానమైనది, రక్తిరాగం చిన్నరాగం. రాగం మొదలైన మనోధర్మ సంగీతరీతులు పాడవచ్చు. ఉప ముఖ్య రాగం గా పాడపచ్చు. రక్తిరాగాల్లో రెండవతరహాకి చెందినది. ఎక్కువ సేపు పాడటం ఉచితంకాదు.

మూర్ఛనని బట్టి - కృతిని బట్టి రాగమును పాడవచ్చు.

రచనలు

1. పలుకవదేమిరా ఆది త్యాగయ్య
2. నీకేల నాయెడ " "
3. ఎవరికై అవతార. చాపు "

# దేవగాంధారి

దేవగాంధారి 29వ మేళకర్త ధీరశంకరాభరణం జన్యం. భాషాంగరాగం కైశికనిషాదం అన్యస్వరం వీరరసప్రధానమైనరాగం.

మూర్ఛన

ఆరోహణ - స రి మ ప ద స - ఔడవం

అవరోహణ -1. సఁ ని ద నీ ద ప మా గా రీ స వక్రసంపూర్ణం

2. స ని ద ప మ గ రి స

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | ద | నఁ | ని | స | |

స్వరస్థానములు స,ప,గాక చరి, అంగా, శుమ, చధై, కాని. కైశికనిషాదం అన్యస్వరం.

దనీదప అనేప్రయోగంలో కైశికనిషాధం వస్తుంది.

వర్జ్యరాగం. అరోహణలో గ,ని, లేవు అపురూపరాగం.

అవరోహణలో వక్రసంపూర్ణం. ఔడవ వక్రసంపూర్ణం, నిర్దుష్టమైన రూపం గల రాగం.

దేవగాంధారి, ఆరభి, కవల రాగాలు (Twins)

వాది స్వరాలు స, ప

సంవాదులు. స-ప ; స-మ ; రి-ద ; గ-ని ;

మ-ని ; ప-సఁ ;మ-సఁ ; గ-ద ;

జీవస్వరాలు -
అంశస్వరాలు | రి, గ, మ, ని

గ్రహన్యాసస్వరాలు స, రి, ప

గ, మ, ద, ని,లు గ్రహన్యాసస్వరాలు కావు.

విశేషప్రయోగాలు. రీరీ గామప మగగారిరీస

రిమాగమాగగారిరీ,స

దనిసారిస నిసాని దనీదపా

నిదపమదా దనిసారిసనీసని దానిద పదనీసని దానిద పాదప.

సంక్షిప్తరాగాలాపన.

రీరీరీరీ రిమాగమాగగారీరీస । సారిగసారిగరీగరిసనిద్ధా । ధనిసరీ । మపదా । నిసరీ । గమాగగారీరిసా । సారిగాసరిగరీగ రిససా దనిసారిస నిసాని ద నీదపా । పాదనిద మపదప పదనిద దపదప పమపమ మరిమరి రిసరిసద్ధా

రిసా రీరీపామపా పాపా । పానిదనీదదాపా । నిదపమమదా ;; । నిదపమగరీ । ( ) । మాగగారిరీసా । సారిగా సారిగరీగరిసని దా । దనీదాపా పాదప మా ;;స । సారీ ;; గామపమాగగారీరీస సారిగాసా । సారిగరిసనిదా రీదాసా ।

రచనలు

1. క్షీరసాగరశయన ఆది త్యాగరాజు
2. సీతావర సంగీతజ్ఞానము ఆది త్యాగరాజు
. క్షితిజారమణం ఆది దీక్షితర్
. కరుణాసముద్రా ఆది త్యాగరాజు.
. కొలువైయున్నడే ఆది త్యాగరాజు.

# దేవామృతవర్షిణి

దేవామృతవర్షిణి 22 వ మేళకర్త ఖరహరప్రియజన్యం

మూర్ఛన

ఆరోహణ స రి గ మ ని ద ని సం ( సరిగమనిదనిపదనిస)

అవరోహణ సంని ద ప మ గ రి స

స్వరస్థానాలు స, ప, గాక, చరి, సాగా శుమ; చద్వై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగరాగం (వక్రసంపూర్ణం) వక్రషాడవ సంపూర్ణం. ఈరాగానికి ఖరహరప్రియకి చాలా సూక్ష్మమైన భేదం. నిదనిసా అనే వక్రప్రయోగం ఈరాగానికి ఉంది. సంపూర్ణరాగం అయిన ఖరహరప్రియలో కూడా ఇట్లాంటి వక్రాలు వేయటం ఉచితమే. అయితే ఈరాగంలో ఈ వక్రం వేసితీరాలి. రాగాలాపన మొదలైనవి ఈ రాగంలో వీలు లేదు. పదనిసం, పదనీదనిసాంనిసాం అనేవి విశేషప్రయోగాలు.

వాది స

సంవాదులు స - మ; రి - ద; గ - ని; మ - స;ప - స.

జీవస్వరాలు స,మ,ప,ని

గ్రహన్యాసాదులు: స, రి, మ, ప, ద.

రాగాలాపనకు, స్వరకల్పన నెరవు మొదలైన వాటికి ఉచితమైనరాగం కాదు. ఈ రాగం త్యాగరాజ-వారి సృష్టి

ఎవరని నిర్ణయించేదిరా ఆది త్యాగరాజు.

# ధవళాంబరి (ధవళాంగ)

ధవళాంబరి 49వ మేళం. 9వ బ్రహ్మ చక్రంలో 1వరాగం 'ప' ప్రస్థారం సంపూర్ణం, వివాది. 'శుని' ఉంది కనుక వివాది.

స్వరస్థానాలు స,ప,గాక, శురి, అంగా, ప్రమ, శుధై, శుని

| స | రి | . | . | గ | . | మ | ప | ద | ని | . | . | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

పూర్వాంగం కామవర్ధని స్వరాలు, ఉత్తరాంగం కనకాంగి స్వరాలు.

గమపదపామగరిగా । మపదపదా । ననిసరిగాగారిగారిసా। నినిసరిసనిసరిసనిసా।
దపమగ మగారిసానిసా ।

పూర్వాంగం ఉత్తరాంగం కలుపుతో, పాడాలి. ద,ని లను విడ దీసిగాని, దీర్ఘాలుగాగాని పాడాలి.

వేంకటమఖి సంప్రదాయంలో ఈరాగం 'ధవళాంగ'రాగాంగం సంపూర్ణం షడ్జగ్రహం.
ఆరోహణ యందు నిషాధం వర్జ్యం, ఎల్లప్పుడును గానం చేయదగును.

మూర్ఛన సరిగమపదసా । సనిదపమగరిస

చనలు

.లక్ష్యగీతం - రాధాశుభగుణగణ, త్రిపుట వేంకటముఖి.

.కృతి - శృంగారాదినవరసాంబా - ఖండ ఏక, ముద్దుస్వామిదీక్షితర్

3.సంచారి మత్య - సుబ్బరాయదీక్షితర్.

జన్యరాగమూర్ఛనలు

| | | | |
|---|---|---|---|
| ధవళాంగి | సమగమపదనిదస | । | సనిదపమగరిస |
| భిన్నహేరాళి | సమపదనిదస | । | సనిదపమగరిస |
| 3. దేవగిరి | సరిమపదస | । | సనిదపమగరిగస |
| 4. ధర్మాణి | సరిగమదనిస | । | సనిదమగరిస |
| 5. ఛాయామారువ | సగరిగమదనిదస | । | సదనిపమగరిస |
| 6. ధీరస్వరూపిణి | సరిగమపదనిస | । | సదనిదపమగస |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | దేవాభరణం | సగరిగమదనిస | | సనిదనిపమగరిస |
| 8. | నవరసచంద్రిక | సరిగమదనిస | \| | సదపగరిస |
| 9. | నవరస ఆంధాళి | సగరిగమపదస | \|\| | సదపమగరిగస |
| 10. | స్వరాభరణం | సగమపదనిస | \| | సనిదపమస. |

# ధన్యాసి

ధన్యాసి 8వ మేళకర్త హనుమత్తోడి జన్యం ఉపాంగం

మూర్ఛన

ఆరోహణ స గ మ ప ని స

అవరోహణ స ని ద ప మ గ రి స

వర్జ్యరాగం, ఆరోహణలో రి,ధ, లు లేవు ఔడవసంపూర్ణం కరుణ, భక్తి శాంతః రసప్రధానమైనది. ఎల్లప్పుడు పాడవచ్చు.న్చు.

ఉదయం శ్రేష్టం స్వరస్థానాలు స,ప,లు గాక శుద్ధరిషభం, సాధారణ గాంధారం శుద్ధదైవతం, కైశికనిషాధం

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | గ | . | మ | . | ప | ద | . | ని | . | స |

గమకంగా మూర్ఛన

ఆరోహణ సా గమగా మ పా పాసనీసనీ సా
సా గా మ పా నీ సా

అవరోహణ స సని పద ప మ మగ సరి సా
స ని ద ప మ గ రి స

వాది స్వరాలు స,ప

సంవాదులు స-ప; స-మ; గ-ని; మ - ని; మ-స; ప-స; రి-ద; గ - ద;

జీవస్వరాలు అన్ని జీవస్వరాలే

గ్రహన్యాసస్వరాలు స, గ, మ, ప, ని
రి, ద, లు గ్రహన్యాసాలుకావు.

అరుదుగా రి, ద లతో మధ్యమదురితకాలాల్లో సంగతి ప్రారంభించవచ్చును.; కాని న్యాసంఎప్పుడూ చేయకూడదు.

నాజూకైన రాగం నిర్దుష్టమైన రూపం, రసం, కలిగినరాగం. రాగంమూడుస్థాయిల్లో మంద్ర , మధ్య, తారస్థాయిల్లో విళంబ, మధ్య, ద్రుతలయల్లో చక్కగా రాణించే రాగం. సర్వ స్వరగమక, వరీక, రక్తిరాగం. భక్తిరసమైన పద్య ,శ్లోకపఠనానికి అనుకూలమైన రాగం కర్ణాటక శైలిలో ప్రత్యేకత కలిగినరాగం. కర్ణాటక శైలిని ప్రస్ఫుటించేరాగం. హనుమత్తోడి జన్యరాగాల్లో ముఖ్యమైనది. తోడి కుటుంబంలో రెండవ స్థానం కలిగినది ఉపముఖ్యరాగంగానూ, సందర్భాన్ని, విద్వాంసుని ప్రతిభని బట్టి ముఖ్య రాగంగాను కచ్చేరీలో పాడటానికి అవకాశం (scope) ఉన్నరాగం, ధన్యాసి. దీనిని విన్న తరువాత "ధన్యోస్మి" అనుకునేంత తృప్తిని ఇస్తుంది. రాగాలాపన, నెరవు స్వరకల్పన, తానం, పల్లవి బాగా పాడటానికి వీలున్నరాగం. పెద్దరాగాల్లో లెక్కపెట్టతగ్గది.

పనిసదాప సగమరీస నిససససనీప పనినిపామగా సరినిసపా ఇవి అపూర్వ ప్రయోగాలు.

రంజక ప్రయోగసహితక సంక్షిప్తరాగాలాపన.

స్గాపమగారిస్తాస్గారిన్నిస్తాప్తాప్తాసానిసా । సగమపామగా । మగాగారీరీస్తా । సగమపామగా । గమపదాప । పమగా । గమపనీనీ । నీసదాప । పాసనిసా। పనిసారి ససనినీపనిసా । పనిసగరీస । సనిసదాప । పనిసామగరీసా । సనిసాగమరీసా । పనిసరిసానినిసనీప । పనిపమగా । గమపనిసాగరిరిసాని దపమగా । గమపనీనిసగరిరిసానిదపమగా । గమపనీసదాపమగా గమపనిదాపమగా పమగారిస్తా । స్తారిన్నిస్తాస్తాస్ననిస్తా ।

రచనలు

1. శ్యామసుందరాంగ రూపకం త్యాగరాజు.
2. సంగీతజ్ఞానము ఆది "
3. నీచిత్తమునిర్మలమని చాపు "
4. మీనలోచనా చాపు శ్యామశాస్త్రి.

# ధర్మవతి (ధామవతి)

ధర్మవతి 59వ మేళరాగం, 10యవదిశిచక్రంలో 5వరాగం. 'మ' ప్రస్థారం రాగాంగం సంపూర్ణం, సువాది.

స్వరస్థానాలు  స,ప,గాక, చరి, సాగా, ప్రమ, చద్రై, కాని

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | . | మ | ప | . | ద | ని | స |

గ్రహం,వాది స.

సంవాదులు స -ప;   రి – ప;   రి - ద;   మ ని;   ప – స;

అన్నిగ్రహన్యాస స్వరాలే

ఈ మేళం రాగదశకుచేరుకుంటున్నది. ఈరాగం లో రెండు మూడు కృతులు ప్రచారంలోకి రావడంమూలంగా ఈరాగం ఒక రూపం సంతరించుకుంటున్నది.

పూర్వ ఉత్తరాంగ స్వరాలను కలుపుతూ దీర్ఘస్వర సమాసాలను పాడితే శ్రావ్యంగా ఉంటుంది. ఈరాగ రూపం కూడా తీసుకురావచ్చు. ఈరాగం చాలా (అందంగా) క్రొత్తగా, వయ్యారంగా ఉంటుంది. కర్ణాటకబాణీలోని రంజని, మధువంతి అనే హిందుస్థానీరాగం ఈరాగ జన్యాలే.

ఈ రాగం 'రి' గ్రహంచేస్తే 16వ మేళం చక్రవాకం వస్తుంది.
'ప' " " 27వ " సరసాంగి "

వేంకటమఖి సంప్రదాయంలో ఈరాగం 'ధామవతి' రాగం , షడ్జగ్రహం, సంపూర్ణం ఎల్లప్పుడుగానముసేయదగును. సగరిగమప, దపమపద సదాగరిస సదపమపగరిస అనునవి విశేషప్రయోగాలు.

రచనలు

1.లక్ష్యగీతం- హిమగిరీంద్రాత్మజే ఝంప. -వెంకటముఖి.

2.కృతి - పరంధామవతీజయతి త్రిసఏకక దీక్షితర్

3.సంచారి - రూపకం, –సుబ్బరాయదీక్షితర్

4.భజన సేయరాదా - రూపకం -వాసుదేవాచారి.

ఇందు జన్యరాగములు

| | | | |
|---|---|---|---|
| 1. ధౌమ్యరాగము | సరిగమపదస | \| | సనిదపమగరిస |
| 2. రంజని | సరిగమదస | \| | సనిదమగసరిస |
| 3. విజయశ్రీకంఠి | సగమపస | \| | సనిదమగరిస |
| 4. విజయనాగరి | సరిగమపదస | \| | సదపమగరిస |

# ధాతువర్ధని (ధైతపంచమరాగం)

ధాతువర్ధని 69వ మేళం 12వ ఆదిత్య చక్రము నందు 3వరాగం 'గో' ప్రస్థారం వివాదిరాగం, సంపూర్ణం.

స్వరస్థానాలు స,ప,గాక, షరి, అంగా, ప్రమ, శుద్దై, కాని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | రి | గ | . | మ | ప | ద | . | . | ని | స |

పూర్వాంగంలో షట్స్రుతి " రిషభం ఉందిగాన ఇదివివాదిరాగం. ఉత్తరాంగంలో మయామాళవగౌళ స్వరాలు ఉన్నాయి.

సరీగామపమగారీస్తా । గారిగామపా । పదని సారీసా సనిదపమ । గమగా । రీగారీ । సారీసా । సానిదపా । పదనిసరీసా । గారి గా । మపదపమగా । రీగామపా । పదనిస రీరీసా । నిసనిదపమగా రిగారిసాసా నిదపదనీదనీసరీసా

ఈ ప్రయోగాలు పాడాలి.

వేంకటమఖి సంప్రదాయంలో ఈరాగం "ధౌతపంచమం"

మూర్ఛన సరిగమపదనిస సనిదపమరిగాస

రాగాంగం, సంపూర్ణం, షడ్జగ్రహం. అవరోహణయందు రిషభంవక్రం. అన్నివేళల గానము సేయదగును.

ఇందు, మ ప ద సా, నిపనిసా, సనిపమప, దపమపరిగసా అను ప్రయోగములు కలవు.

రచనలు

1.లక్ష్యగీతం - రుద్రతురూర-ధృవ-వెంకటమఖి.

2.కృతి -మాతంగీమరకతాంగి – సుబ్బరామదీక్షితర్

3.సంచారి -రూపకం _ సుబ్బరాయదీక్షితర్.

ఈరాగనిషాధమును గ్రహముచేసిన 13వమేళం గాయకప్రియవచ్చును.

ఇందు జన్యరాగమూర్ఛనలు

1.ధౌతపంచమము సరిగమపనిపస । సనిదనిపమరిగమరిస

2.కుంతలసింహారవము సరిమపమదనిస । సదపమరిస.

# ధీరశంకరాభరణం

ధీరశంకరాభరణం 29 వ మేళకర్తరాగం 5 వ బాణచక్రం 5 వ రాగం, మ ప్రస్థారం, సంపూర్ణం.

స్వరస్థానాలు స, ప, గాక, చరి, అంగా, శుమ, చద్రై, కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | ద | . | ని | స |

ధీర అనేపదం శంకరాభరణానికి చేర్చి 72 వ మేళకర్త పథకానికి సరిపోయేట్టట్లుగా చేసేరు కాని ఇది శంకరాభరణమే ఇది మూర్ఛన అదిరాగం ధీరశంకరాభరణం మూర్ఛన, శంకరాభరణంరాగం ధీర అను పదం చేర్చటంతో మేళసంఖ్యచక్రం, ప్రస్థారం తెలుస్తాయి. శంకరాభరణం గూర్చి విపులంగా ప్రసిద్ధరాగాలలో ఉన్నది.

ధీర శంకరాభరణంలో అనేక జన్యాలు ఉన్నాయి. ఇది కూడా సర్వస్వర మూర్ఛన కారకమేళం.

శంకరాభరణ రాగలక్షణంలో మూర్ఛనలు ఈయడం జరిగింది.

వెంకటమఖి సంప్రదాయంలో కూడా ఈరాగాన్ని ధీరశంకరాభరణం అంటారు

రచనలు

1. లక్ష్యగీతం రిపుబలఖండనురే మఠ్య వెంకటముఖి
2. కృతి సదాశివముపాస్మహే ఆది దీక్షితర్
3. "అక్షయలింగలిభో — మిశ్రేక"
4. "శ్రీదక్షిణామూర్తి — ఝంప"
5. "నాగలింగంది" — ఆది
6. "శ్రీకమలాంబికయా రూపకం"
7. "శంకరాచార్యం ఆది సుబ్బరాయ దీక్షితర్
8. "మహాశక్తి రూపకం"
9. అష్టాంగయోగ ఆది ఎట్టప్పమహరాజు
10. శారదే సదాసయే త్రిసఏక కృష్ణస్వామి అయ్యర్

11. శంకరాభరణ ఏక" కృష్ణస్వామి అయ్యర్

12. శంభోజగదీశ ఆది రామస్వామిదీక్షితర్

13. వాహనావళ్లీమణావా ఆది ఎట్టపురం రామదాసు

14. తాన వర్ణం ఆట

15. సంచారి రగణమత్యతాళం - సుబ్బరాయదీక్షితర్.

ధీరశంకరాభరణ రాగంలో జన్యరాగాలు వాటి మూర్ఛనలు

1. కేదారము సమగమపనిస । సనిపమగమదమగరిస
2. ఆహిరినాట సమగమపదనిస । సనిపదనిపగమగస
3. మాహుం సరిగరిమపని । దపమగరిస
4. కోలాహలము సపమగమపదనిస । సనిదపమగరిస
5. జనరంజని సరిగమపదపనిస । సదపమరిస
6. బ్యాగు (బేహగ్) సగమపనిదనిస । సనిదపమగరిస
7. హంసధ్వని సరిగపనిస । సనిపగరిస
8. పూర్ణచంద్రిక సరిగమపదపస । సనిపదపమగమరిస
9. దేవగాంధరి సరిమపదస । సనిదపమగరిస
10. ఆరభి సరిమపదస । సనిదపమగరిస
11. నవరోజు సదనిసరిగమప । మగరిసనిదప
12. అఠాణా సరిమపనిస । సనిదపమగరిస
13. జులావు పనిసరిగమప । మగరిసనిపని
14. కన్నడ గరిసరిగమపమదనిస । సనిసదపమపగమరిస
15. బిలహరి సరిగపదస । సనిదపమగరిస
16. శుద్ధసావేరి సరిమపదస । సదపమరిస
17. నాగధ్వని సరిసమగమపనిదమపనినిస । సనిదనిపమగస

18. శుద్ధవసంతం సరిగమపనిస । సదనిపమగరిస

19. ధీరమతి సగరిగమపమనిదస । సనిపదసపమగరిస

20. బేగడ సగరిగమపదనిదపస । సనిదపమగరిస

21. వివర్ధని సరిమపస । సనిదపనిదమగరిస

22. సింధురాగం సరిగరిమపస । సనిదపనిదమగరిస

23. పూర్వగౌళ సరిమగరిమపనిదనిస । సనిదపమగరిస

24. శుంభక్రియ సగరిమపనిస । సనిపనిమగరిస

25. గౌడమల్లారు సరిమపదస । సనిదమగరిస

26. గరుడధ్వని సరిగమపదనిస । సదపగరిస

# ధేనుక

ధేనుక 72 వ మేళకర్తల పధకంలో 9 వ రాగం, 2 వ నేత్రచక్రం 'గో'ప్రస్థ
స్వరస్థానాలు స,ర,గి,మ,ప,ద,ను. స, ప,గాక, శురి, సాగా, శుమ, శుద్రై, కాని

| స | రి | . | గ | . | మ | . | ప | ద | . | . | ని | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

తోడికి కాకలినిషాదం

పూర్వాంగం తోడి ఉత్తరాంగం మాయమాళవగౌళ

అనుకుంబ పాడటం సులభం

నిర్దుష్టరూపం కలిగినరాగం ఈ మేళాన్ని రాగంగాప్రసిద్ధికి తెచ్చిన ఫ త్యాగరాజస్వామి వారిదే.

ఈరాగంలో గల సాధారణ గాంధారాన్ని గమకం లేకుండా పాడటం సంప్రదా అయింది. అలాగైతే ధేనుక రూపాన్ని తీసుకురావచ్చు. పూర్వాంగస్వరాలు ఉత్తరాం రాలు కలిపి సంగతులుగా పాడితే ధేనుక ప్రత్యేకరూపం వస్తుంది. లేకపోతే అ తోడి పాడుతో కాకలినిషాధం పాడుతోన్నట్లు ఉంటుంది.

గమపదనిదప। గారిసనిదప। పమగారిసనిధా।

సరిసనిదపమగా। పదనీదపమగారిస।

ఈ ప్రకారం పొడవుగా ఉండే స్వరసముదాయాలు పాడితే శ్రోతలలో రాగం గురి సందేహాలు రావు. రాగం ప్రతిపాదన జరుగుతుంది.

జీవస్వరాలు గ, ని,

వాదిస స.

సంవాదులు స- మ; స - ప; రి - ద;

ఈ రాగాన్ని (మేళాన్ని) వెంకటమఖివారి సంప్రదాయంలో ధునిభిన్నషడ్జం అంట

రచనలు

1. గీతం రసికకుశలవ ఝంప వెంకటమఖి
2. తానం వెంకటమఖి

3. కీర్తన శ్రీగురుగుహమూర్తికి నేశిష్యుడైయున్నానురా త్రిసేక పొన్నయ్య.

4. సంచారి మత్య సుబ్బరాయదీక్షితర్

5. తెలియలేదు రామ ఆది త్యాగరాజు

ఇందు జన్యాలు

1. శోకవరాళి సగమనిదపమగరిస

2. టక్క- సగమపమదనిస - సనిదపమగరిస

3. మోహననాట సగామపదపమపనిసా సనిపదపమగస

4. భూపాలం సరిగమపదస సదపగరిస (వేంకటమఖి సంప్రదాయ ప్రదర్శిని)

5. ఉదయరవిచంద్రిక సగమపనిస సనిపమగస సం" సం" ప్ర"

ఇది మూర్ఛన కారకు రాగము

ఈరాగం రిషభగ్రహం చేస్తే 66 వ మేళం చిత్రాంబరి

" మధ్యమం " 55 వ షణ్ముఖప్రియ

" ధైవతం " 35 వ రాగం శూలిని, వస్తాయి.

# నఠభైరవి (నారీరీతిగౌళ)

నఠభైరవి 20వ మేళరాగం. 4వ వేద చక్రంలో 2వ రాగం, శ్రీప్రస్తారం. సంపూ 'ర్ణం.

స్వరస్థానాలు స,ప,గాక, చరి, సాగా, శుమ, శుద్దైకైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | ద | . | ని | . | స |

వివాదిస్వరాలు లేని రాగాలను సువాది రాగాలనవచ్చు. ఇది సువాదిరాగం.

ఈరాగం భైరవి యొక్క జనకరాగం. మూర్ఛన కారక మేళరాగం.

స . రిగ . మ . పద . ని . స. నఠభైరవి.
ని . సరి . గ . మమ . ద . ని చ్యుతపంచమతోడి
ద . నిస . రి . గమ . . ప.ద శంకరాభరణం
ప . దని . స . రిగ . మ . ప ఖరహరప్రియ.
మ . పద . ని .సరి . గ . మ తోడి.
గ . మప . ద.ని స.రి . గ కళ్యాణి
రి. గమ . ప . దని . స.రి హరికాంభోజి

ఈరాగంలో కొన్ని కృతులు ఉండటంచేతనూ సువాదిరాగం అవటంచేతను ఈ గం రాగదశను చాలావరకు చేరుకొన్నది. చాల అందమైన సుకుమారమైనరాగం .

గ్రహన్యాసం స, అన్నిస్వరాలు గ్రహన్యాసస్వరాలే.

వాదిస్వరం స,

సంవాదులు స-మ; స-ప; రి-ప; గ-ద; గ-ని; మ-ని; మ-స; ప-స;

ఈమేళంలో అనేక జన్యరాగాలు ఉన్నాయి. సంవాదులు ఎక్కువగా ఉండటం సంగీతవిలువలు సహజంగా అధికంగా ఉన్నరాగం. ప్రపంచసంగీత **రీతులలో**

ఎక్కువగా వాడేరాగాల్లో ఇది ముఖ్యమైనది.

ఈ రాగం గమకయుక్తంగానూ బాగుంటుంది.

గమకంలేకపోయినా శ్రావ్యంగానే ఉంటుంది.

సంక్షిప్తరాగాలాపన

స్సారిగమపదనీదపా | మగరీ | సనిదనీదనీసా | రిగపమగరిసా | రిగమా | పదనీ దధా పా | పాదపమాగారీ | గమపదనీదాపా | దపమపదనీ | దపమా | పదనిసా | దనిసా నిసరినీదపమగరిగస | నిదపా | పదనిసరిగమాపదనిసా | పదనిసరీ గారీ గరిసనిదానిసరిగమాగారీ | గరిసనిసా | సనిదపపదనీదపమా | మపదమ పమగరీ గరిసనిదనీదనీసా. |

వేంకటముఖి సంప్రదాయంలో ఈరాగం పేరు 'నారీరీతిగౌళ' మూర్ఛన సారిగామనిదపనినిసా సనినీదమాగగరిస. రాగాంగం సంపూర్ణం, నిషాధగ్రహం అరోహణయందు ధైవతం వర్జ్యం ఘనరాగం సా.యంకాలము గానము సేయదగును. ఈ రీతిగౌళరాగమునకు నీ, సా, గ, గా, మా, జీవస్వరాలు న్యాసస్వరములు రచనలు

1. లక్ష్యగీతం ఈశ్వరీలక్కుమా గీర్వాణి ఝంప వేంకటముఖి.
2. చిట్టతానము.
3. శ్రీనీలోత్పలనాయికే రూపకం దీక్షితర్
4. సంచారి మఠ్య సుబ్బరాయదీక్షితర్.

ఈపైరచనలు రీతిగౌళరాగమునందు ఉన్నవి. ఆధునిక కాలములో రీతి ఖరహరప్రియ నందు 'నారీరీతిగౌళ' అసంపూర్ణమేళమేగాక శుద్ధధైవతము గమనార్హము.

ఇందు జన్యరాగాములు

1. అమృతవాహిని సరిమపదనిస | సనిదమగరిస

2.అభేరి సగమపనిస | సనిదపమగరిస

3. ఆనందభైరవి సగరిగమపదపనిస | సనిదపమగరిస

4.ఇందు ఘంటారవము సగమపదపని | దపమగరిసని

5.ఉదయరవిచంద్రిక సగమపనిస | సనిపమగస

6.కమాలాతరంగిణి సరిగమపదనిస | సనిదపమరిస

7.కన్నడ సగమపదస | సనిదమగస. జన్యరాగాలు.

8.కనకవసంతం సగమపనిదస | సనిదపమగరిస

9.కోకిలవరాళి సరిగరిమపదనిదస సదనిదపమరిగరిస

10. ఘంటారవము సరిసగమపనిస | సనిదపమగరిస

11. చాపఘంటారవము సగామపనీ | దమాగరిసని

12. జింగ్లా సరిగమపదనిదసప | సనిదపమగరిస

13. దేవక్రియ సరిగమనిదని | పదమగరిసని

14. నారాయణదేశాక్షి సరిగమపదని | నిదపమగరిసని

16. నీలవేణి సరిగమపదనిదస | సదపమగరిస

17. పూర్వభైరవి సరిగమపనిదనిస | సనిదపమగరిస

18. పూర్ణషడ్జమం సపమపదపస | సనిదమగరిసా

19.భైరవి సరిగమనిదనిస | సనిదమగరిస

20.భువనగాంధారి సరిమపనిస | సనిదపమగస

21.మాంజి సరిగమపదనిస | సనిదపమగారిస

22. మార్గహిందోళం సరిగమపదనిస | సనిదపమగస

23.రాజరాజేశ్వరి సరిమపదస | సనిదపమగరిస

24.రీతిగౌళ సగరిగమనిదమనినిస | సనిదమగమపమగరిస

25.శుద్ధదేశి సరిమపదనిస | సనిదపమగరిస

26.శుద్ధసాళవి సగమపనిస | సనిపమరిస

27.సారమతి సరిగమపదనిస | సనిదమగసరిస

28. సారంగకాపి  సరిపమరిపరిమపనిస | సనిదపమగరిస

29. హిందోళవసంతం.  సగమపదనిదస | సనిదపమగదమ

30. హిందోళం  సమగమదనిస | సనిదమగస.

# నభోమణి

నభోమణి 40వ మేళకర్త నవనీతము జన్యం

ఆరోహణ సగరిగమపస

అవరోహణ సనిదపమగరిస

స్వరస్థానాలు స,ప,గాక, శురి,శుగా, ప్రమ, చద్వి,కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | . | మ | ప | . | ద | ని | . | స |

అపూర్వరాగం ఉపాంగరాగం. శుద్ధగాంధారం ఉంది గనుక వివాదిరాగం. వక్రజౌడవ సంపూర్ణరాగం. ప్రాచీనరాగం కాదు. త్యాగరాజస్వామివారే ఈ రాగన్ని సృష్టించారు. ఈ రాగమున ఇతర వాగ్గేయకారుల రచనలు లేవు.

సంక్షిప్తరాగాలాపన.

సా । సగారీగమా । మామగగా । గరిరీసా । సానిదాపాసా । పాసారిరిసా । గా।గా రిగమా । పానిదపమగామా । పననినినిదాదప । పమగరిగామా । పాసా । పాసా రిసరీరీ। గారిగమా। గమపమగరీసా । సానీవా। ధసనిదప। పనిదప । మదపమగా। గామపమగా। రీసా। సారిరిసనిదపాస్తా రీరీరీ,రిససా ।

రచన

నాయెడవంచన సేయకురా ఆది త్యాగరాజు.

# నవనీతం, (నభోమణి)

నవనీతం 40వ మేళకర్త 7వ ఋషిచక్రంలో 4వరాగం భూప్రస్థారం. సంపూర్ణం వివాది.

పూర్వాంగం వివాది(శుగ) ఉత్తరాంగం సంవాది. స్వరస్థానాలు సప, గాక, శురి, శుగ ప్రమ, చద్రై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | . | మ | ప | . | ద | ని | . | స |

పూర్వాంగంలో శుగ ఉండటం చేత వివాదిరాగం.

గమపదనిసా । నిదపమగమాగాసరిస । పమగాసరిస । దనిసరిసా । గమపమగా। సరిసాగామపామ। అనేప్రయోగాలు శ్రావ్యంగా, సులభంగా, వివాదిత్వం లేకుండా ఉంటాయి.

వేంకటముఖి వారి సంప్రదాయంలో (సంప్రదాయప్రదర్శిని ప్రకారం) దీనిని నభోమణి అంటారు.

మూర్ఛన సగరిమపదనిస। సనిదపమగరిస రాగాంగం సంపూర్ణం, షడ్జగ్రహం, ఎల్లప్పుడు పాడదగును..

రచనలు

1. లక్ష్యగీతం హేరంబ త్రిపుట వేంకటముఖి.
2. చిట్టతానం
3. కృతి నభోమణిచంద్రాగ్నినయునం త్రిపుట ముద్దుస్వామి దీక్షితర్
4. సంచారి మఠ్య సుబ్బరాయదీక్షితర్

జన్యరాగాలు

1. నభోమణి సరిసరిమపస। సనిదపమగరిస
2. నవరసకుంతలి సమపదనిస। సనినపదమగరిస
3. నాగవేళావళి సరిగమదస। సనిదమగరిస

# నవరసకన్నడ

నవరసకన్నడ, 28వ మేళకర్త .హరికాంభోజ జన్యం

మూర్ఛన

ఆరోహణ సగమపసా

అవరోహణ సనిదమరిసా

స్వరస్థానాలు స,ప,గాక, చరి, అంగా, శుమ, చద్రై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగం వర్జ్యరాగం, ఆరోహణలో రి,ద,ని లేవు అవరోహణలో, ప లేదు స్వరాంతర షాడవరాగం

అవరోహణలో గాని ఆరోహణలోగాని నాలుగు స్వరాలే ఉంటే దాన్ని స్వరాంతరం అంటారు. ఈరాగంలో ఆరోహణలో నాలుగు స్వరాలు ఉండటం విశేషం స్వరాంతరం చాలా అరుదుగా ఉంటుంది.

ఈరాగం క్రియాంగ రాగాలకోవలోకి వస్తుంది. వీరరస ప్రధానమైనది. దీనికి నిర్దిష్టమైన రూపం ఉంది. కంపవిహీనరాగం. గాత్రంకంటేకూడా వాద్యం మీద ఈరాగం విశేషంగా రాణిస్తుంది.

వాది స

సంవాదులు స-మ; స ప; మ స; ప స; ని-మ; ప రి;

జీవస్వరాలు స,గ,ప,ని.

గ్రహన్యాసాదులు స,గ,ప.

రాగం పాడటం బాగుండదు. వాద్యంమీదన వాయించవచ్చు. మధ్యమకాలందురిత కాలల్లో రాగం బాగుంటుంది.

రచనలు

నినువినానామదెందు రూపకం త్యాగరాజు.

# నళినీకాంతి

నళినికాంతి రాగం 29వ మేళకర్త ధీర శంకరాభరణజన్యంర్యం
మూర్ఛన

ఆరోహణ సగరిమపనిసా సనిపమగరిసా

స్వరస్థానాలు స,ప,గాక, చరి;అంగా; శుమ;కాని ఉపాంగం, వర్జ్యరాగం మూర్ఛనలో 'ద' లేదు. వక్రషాడవషాడవరాగం. రక్తిరాగం. అర్ధకంపితరాగం. అనగా ఎక్కువగా గమకం ఇవ్వనక్కరలేదు. గమకరాగంకాదు.. వరీకరాగం. స్వరాలు శుద్ధంగా (plain) పడితేనే రాగచిత్రా న్ని బాగా చిత్రీకరించవచ్చు చాలా రక్తిరాగాలకు త్యాగరాజస్వామి రూ పం, గౌరవం ప్రసాదించారు. అట్లాంటిరాగాల్లో ఇది ఒకటి.

స్వరస్థానాలు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | . | . | ని | స |

గమగంగా మూర్ఛన

ఆరోహణ

స గ <u>గరి</u> మ ప <u>సని</u> సా

స గ రి మ ప ని సా

అవరోహణ

స సని ప పమమా గ గరి రిససా

స ని ప మ గ రి స

రాగాలాపన స్వరకల్పనమాత్రం చాలాసేపు పాడవచ్చు నెరవు తానం పల్లవి పాడడం ఆచారంలేదు కాని పాడగలిగితే పాడటానికి అవకాశం ఉన్న రాగంమంద్ర మద్యతార స్థాయిలో మధ్యమ దురిత కాలాల్లో పాడవచ్చు.

వాది స

సంవాదులు స–ప; రి–ప; స–మ గ – ని; ప–సా; మ–స;

అన్నిస్వరాలు గ్రహ, అంశ, న్యాసస్వరాలే.

సంక్షిప్తరాగాలాపన.

గారీమపా | మపనీపా | మమగరీ | మాగారీసా | నిపనిసగరీ | నిసగారిమాపా | మనీమామగగారి రిసా | గారీమాపానీసానీపా నీసా | సనిపా నిసా | సాసాగారీ వగారిసపానిసా | పనిసాగారీమాగారిసపా నిసగారిమపమగ రిసా | నిసగరిస నిపనిసరినిసా | పానిమపా మగగారిసా నిసగరిసనిపా నిసరీసపా..|

రచనలు

1. మనవి ఆలకించరా ఆది త్యాగరాజు

2. శిరిశిరక్కుమేని త్రిపుట అరుజగిరినాధర్

3. నీ పాదమేగతి రూపకం జి.యన్. బాలసుబ్రహ్మణ్యం

# నాగగాంధారి

నాగగాంధారి 20వ మేళకర్త నఠభైరవి జన్యం

మూర్ఛన

ఆరోహణ సరిమపనిదమపనిసా

అవరోహణ సనిదపదమగరిగస

స్వరస్థానాలు స,పగాక, చరి.సాగా .శుమ, శుధై, కైని.

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | ద | . | ని | . | ప | ప |

ఉపాంగరాగం వర్జ్యరాగం ఆరోహణలో 'గ' లేదు వక్రషాడవ

వక్రసంపూర్ణం

వాది స.

సంవాదులు సప; సమ; రిప; గ–ద; గని; మ–ని; మ–స; ప–స;

జీవస్వరాలు స,మ,గ,ప,ద,ని

గ్రహన్యాసాలు స,ప,రి,మ

చిన్నరాగం రాగాలాపన మొదలైన మనోధర్మసంగీతరీతులకు అనుకూలమైనరాగం కాదు. కృతి మీద ఆధారం అయినరాగం.

రచనలు

సరసిజనాభసోదరి రూపకం దీక్షితర్

' ''' ఎ

ఈ రాగం 28వ మేళకర్త హరికాంభోజ జన్యం

ఉపాంగరాగం వర్జ్యరాగం, రిషభం,. నిషాధం వర్జ్యం ఔడవరాగం

మూర్ఛన

ఆరోహణ సగమపదస

అవరోహణ సదపమగస

స్వరస్థానాలు స,ప,గాక అంతరగాంధారం, శుద్ధమధ్యమం. చతుశృతి ధైవతం,

స్వరస్థానాలు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | . | గ | మ | . | ప | . | ద | . | . | స |

ఈరాగం మధ్యమం గ్రహం చేస్తే హంసధ్వని వస్తుంది.

నాగస్వరావళి స .. .. . గమ . ప . ద .. స

హంసధ్వని ప . . . నిస . స . రి . గ

రక్తిరాగం. అపూర్వరాగం అన్నివేళలా పాడవచ్చు. మూడుస్థాయిలులోనూ మూడు లయల్లోనూ పాడవచ్చు. భక్తిరసప్రధమైనరాగం.

వాది స; సంవాదులు స-ప; గ-ద; స-మ; ప-స; మ-స;

అన్ని జీవస్వరాలే

నిర్ధుష్టమైన రూపం ఉంది రసభావాలు ఉన్నాయి. శ్రోతలలో ఎక్కువ పరిచయం ఉన్నరాగం కాకపోయినా అందంగా ఉంటుంది.

రాగాలపన మొదలైన అన్ని మనోధర్మసంగీతశాఖలకు అవకాశం ఉన్నరాగం

గమకంగా మూర్ఛన

ఆరోహణ

స గ గాపమ పపసదా దసా
స గ మ ప ద స

అవరోహణ

స దసదా ప పమమా గ గసా
స ప మ గ స

రాగరంజక ప్రయోగాలతో సంక్షిప్తరాగాలాపన.

గామపమమ గాసా । సాగగదసా । దసగమపమగా । మగమపా మగపప మగసా దాసా గమపా । గమపదసదాప । మాగా । గమపాదదపమగా । గమపదసదస దా పమ ; మపదసా సదపమగా । గమపదసా పసదసా । సగమగ సగదసా దసగ మపమగాసా । సగమగసద సగాసా దసదాపమా ; గమపామపదా పదసాద సదాప మాగపమగసాసగాదసా పసదసా.।

రచనలు

శ్రీశంకరగురువరం రూపకం.

# నాగానందిని (నాగాభరణము)

సారిగానందిని 30 వ మేళకర్త 5 వ బాణచక్రంలో 6 వ రాగం. సంపూర్ణం స్వరస్థానాలు స, ప, గాక, చరి, అంగ, శుమ, షద్రై, కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | . | ద | ని | స |

ఇది వివాదిరాగం. పూర్వాంగం శంకరాభరణం స్వరస్థానాలు కలిగి ఉంది. ఉత్తరాంగంలో 'ప' షట్శ్రుతి ధైవతం అనగా కైశికనిషాధం. షద్రై కాకలినిషాదం వెంటనే పై షడ్జమం పాడటం కష్టం అలవాటు చేసుకోవాలి. స్వరస్థానాలు మీద పూర్తిగా అధికారం ఉండాలి. ఆ యా నాదాలు మనస్సుకి పట్టాలి. గొంతులో పలికించాలి ఆ సూక్ష్మభేదం గుర్తించడమే సంగీత జ్ఞానంలో ఒక అంశం.

పూర్వాంగ ఉత్తరాంగాలు కలిపిపాడాలి. ఇది రాగదశకు చేరుకోలేదు. ప్రతిభతో పాడి శ్రోతలకు రాగాన్ని పరిచయం చేయాలి.

పదాప, నిసరీస సనిస। దాప, నిసరినిసా।

పదపమపా। మగరిసనిసా। అని ద, ని, లను విడదీస్తూ పాడితే సులభం. దనిస అని వరుసగా పాడటం కష్టమేగాక, వివాదిత్వం కూడా ఉంటుంది. దీన్ని కూడా అందంగా సుందరంగా పాడుతూ సంగీత రసానికి తోడు అద్భుత రసాన్ని శ్రోతలలో నెలకొల్పవచ్చును. నిలు దీర్ఘాలుగా పాడవచ్చు . నిదనిపదనిసనిదాప మగరిసనిధాప దానిసరిగమపదాపమప దానీ నీదానీదాప దామపాదానీసా మగరిసనిదాప అని పాడగలిగితే అందంగా ఉంటుంది.

ఇది మూర్ఛన కారకమేళం గాంధారాన్ని గ్రహంచేస్తే 44 వ మేళకర్త భవప్రియ వస్తుంది. పంచమాన్ని గ్రహం చేస్తే 34 వ మేళకర్త వాగధీశ్వరి వస్తుంది.

వెంకటముఖి సంప్రదాయంలో ఈ మేళాన్ని నాగాభరణము అంటారు. మూర్ఛన సరిగమపనిదనిస సనిపమగమరిస మగరిస రాగంగం సంపూర్ణం షడ్జగ్రహం ఎల్లప్పుడు పాడదగును.

రచనలు

1. లక్ష్యగీతం శ్రీరంగధామ రగణమత్య వెంకటమఖి.
2. చిట్టతానం

3. కీర్తన నాగాభరణం 'నాగభరణం' ఆది దీక్షితర్

4. సంచారి మత్య సుబ్బరాయదీక్షితర్

5. సత్తలేనిదినము ఆది త్యాగరాజు.

ఈరాగంలో జన్యం

1. సామంతం సరిగమపదనిస । సనిదనిపమగరిస

2. ప్రతాపకోకిలం దపమపదనిస । సనిపమగస

3. సోమభూపాలం సరిమపమదస । సదనిపమగరిస

4. హంస గాంధర్వము. సరిగమపస । సనిదనిపమరిస

నాటరాగం 36వమేళకర్త చలనాట జన్యం 72మేళకర్తల పథకంలో సరిపోవడం కోసం నాటరాగాన్నే సంపూర్ణంగా చేసి 'చల' అనేపదాన్ని కపటయాది సూత్రానికి సరిపోయేటట్లు చేర్చారు. నాట చాల పురాతనరాగమే. నాట ఘనరాగం 'ఘనరాగాలు అయిదు అవి వరుసగా నాట, గౌళ, ఆరభి, వరాళి, శ్రీరాగం ఘనం అన్నా మధ్యమకాలం అన్నాతానం అని అర్థం ఈ అయిదు రాగాలు వీణ మీద తానం వాయించడం మొదటినుంచి ఆచారం సంప్రదాయం ఘనంఅంటే అసలు అర్థం గొప్పది ఉదాత్తమైనది. అని అర్థం ఈరాగాలు అయిదు గొప్పవి అవడంమూలంగా ఈ అర్థం కూడా సరిపోతుంది.

మూర్ఛన

సరిగమపదనిస 1.

ఆరో సరీగమపనిస 2.

ఆరో సగమపనిస 3.

అవరోహణ

సనిపమగమరీస 1.

అవ సనిపమరిసా 2.

స్వరస్థానాలు స్పపలు కాక

షట్స్రుతి రిషభం; అంతరగాంధారం, శుద్ధమధ్యమం.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | రి | గ | మ | . | ప | . | . | ద | ని | స |

గమకంలో ఈరాగమూర్ఛన

ఆరోహణ

సరీ, గ మ ప పదా, నిస
రీ గ మ ప ద నిస

సని ప పపమా రీ రిసా
సని ప మ రీ సా

"ఆది నాట అంత్య సురటి" అనే నుడి ఉంది. సంగీతకచ్చేరి ఆరంభం నాటతో గాలి సమాప్తం సురటితో చేయాలి. నాటశుభ్రపదం నాటపాడగానే విఘ్నేశ్వరుడు మన స్సులలో ప్రత్యక్షం అవుతాడు ఇప్పటికి నృత్య, నాట్య ప్రదర్శనలలో సంగీతనాటకాల్లో నాటతో విఘ్నేశ్వర ప్రార్థనతో ప్రారంభిస్తారు.

వీణమీద ఈఘనరాగతానం వాయిస్తో ఉంటే వినడానికి మనోహరంగా ఉంటుంది.

షట్స్రుతిరిషభం, షట్స్రుతి ధైవతం ఉండడం మూలంగా ఈ రాగాన్ని వివాదిరాగం రు.

ఆరోహణలో రిషభాన్ని ధైవతాన్ని నొక్కి పలికితే ఆవివాదిత్వంపోతుంది.

స సరి గమ ; ప పద నిస

స రి గమ; ప ద నిస అని పలకాలి సరీగమ, పదానిసా అని కూడా మ్మంది పాడతారు అదీ అందంగానే ఉంటుంది.

అవరోహణలో ధైవతంలేదు. పమ రీస అన్నప్పుడు పమ సరీ స అని శారు. పమరిసా అని పాడినా బాగుంటుంది.

అవరోహణలో ధైవతం లేదు కనుక ఈ రాగం వర్జ్యరాగం సంపూర్ణ వక్రషా గం సనిపమగమరిస అవరోహణ అయితే సంపూర్ణ ఔడవం సనిపమరిస హణ అయితే ఉపాంగరాగం శుద్ధరాగం. నిర్దుష్టమైన రూప రసాలు ఈరాగానికి యి. వీరరసప్రధానమైనరాగం. దీనిలో ఉండే స్వరాల చేరికను బట్టి.

ఈరాగాన్ని సంగీత కచ్చేరిలో మధ్యను పాడటం గాని విస్తృతంగాగాని. పాడటం బాగుండదు. ఈరాగాన్ని మొదటలోనే బహు కొంచెంసేపు పాడితే బాగుంటుంది. ఘనరాగాలు అయిదు పాడి. పల్లవి ఘనరాగమాలికలో పాడితే బాగుంటుంది.

మధ్యమం తప్ప ఈరాగంలో తక్కిన స్వరాలు అన్ని అతితీవ్ర స్వరాలు.

ఈ రాగంలో రచనలు తక్కువే. ముఖ్యంగా పదాలు, జావళీలు అసలు ఉండవు ఇది శృంగారరస ప్రధానమైనది కాదు.

వాది స్వరాలు షడ్జమం, పంచమం.

సంవాదులు స-మ; స-ప; రి-ధ; గ-ని; ప-స; మ-స;

జీవస్వరాలు స,రి,మ,ప,ని. జీవన్యాసస్వరాలు స,రి,మ,ప,ని.

గాంధార ధైవతాలు గ్రహన్యాస స్వరాలు కావు. మంద్రపంచమంనుండి తార పంచమంవరకు పాడవచ్చు. సాయంకాలం రాగం కాని ఎల్లప్పుడు పాడవచ్చు. మధ్యదృతలయల్లో ఈ రాగం బాగుంటుంది.

రాగంతానం పల్లవి స్వరకల్పన ఈరాగంలో బాగుంటుంది. నైరవు పల్లవిలో చేయవచ్చు. యవచ్చు

రాగరంజక ప్రయోగాలతో సంక్షిప్తరాగాలాపన.

గమపా మా మాగ పమమా రీసా సనిరిసనిపా పాసానిసరీస సారిగామపానిపమమా గమపనీపసాని సరీససా సానిసారిసనిప పానినిపపమమమ గమపామపనీప పనిసరీనీసనిపా సానిపమరీ ; పమరీసాసాని సారిసనిప పసనా నిసరీససా.

నాటరాగంలో ప్రసిద్ధకృతులలో కొన్ని

1. జగదానందకారక ఆది త్యాగరాజు (పంచరత్నకీర్తన)

2.స్వామినాథపరిపాలయసుమం ఆది దీక్షితర్

3.మహాగణపతిం " "

4. నిన్నేభజన " త్యాగరాజు.

# నాటకప్రియ. (నటాభరణం)

నాటకప్రియ. 72మేళకర్తల పథకంలో 10వ మేళరాగం. రెండవ నేత్రచక్రంలో నాల్గవరాగం భూప్రస్థారం.

స్వరస్థానాలు స,ర,గి,మ,ప,ది,ని,

స,ప,గాక,శురి,సాగా, శుమ, చధ్తైకైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

పూర్వాంగం తోడి, ఉత్తరాంగం ఖరహరప్రియ అని అనుకుంటే పాడటం సులభం.

ఈ రెండురాగాలమిశ్రమంగా కాకుండా ప్రత్యేకరూపాన్ని ఇచ్చి పాడాలంటే పూర్వాంగ, ఉత్తరాంగాల్లో ఉండే స్వరాలతో సంగతులను పాడితే నాటకప్రియరాగంగా ప్రకాశిస్తుంది.

సానిధనీసరిగమా పా। సారిగమాపదనీదప। నిదపమగారిసనీ। గమపదనిసారిసనిదనీ। దపమగా। పమగారిసనిధనిసా।

వెంకటముఖి వారి సంప్రదాయంలో ఈరాగానికి నటాభరణం అంటారు.

రచనలు

1.గీతం రవితేజా రూపకధృవం వెంకటముఖి

2. తానము

3.కృతి విశ్వనాథంభజేహం ఆది ముద్దుస్వామిదీక్షితర్

4.సంచారి మత్య సుబ్బరాయదీక్షితర్

జన్యరాగలు

దీపరము సరిగమపదనిస సనిదనిపమగరిస

మాగధశ్రీ సగరిమపదస ససపగస

ఈరాగము మూర్ఛనాకారకము, ఈరాగ, గాంధారము గ్రహము చేసినచో 64 వ మేళకర్త వాచస్పతి మధ్యమము గ్రహము చేసినచో 26 వ మేళకర్త చారుకేశి నిషాధము గ్రహము చేసినచో 23 వ మేళకర్త గౌరిమనోహరి రాగములు వచ్చును.

# నాటకురంజ

నాటకురంజి 28వ మేళకర్త హరికాంభోజి జన్యం ఉపాంగం వర్జ్యరాగం అవరోహణలో రిషభంవర్జ్యం భక్తిరసప్రధానమైనరాగం.

మూర్ఛన

ఆరోహణ సరిగమనిదనిపదనిసా

అవరోహణ

1. సనిదమగస "
2. సనిదమపమగసా "
3. సనిదమగరిగమగసా "
4. సనిదమపగరిసా

స్వరస్థానాలు స,ప,గాకచ చతుశ్రుతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం. చతుశృతిధైవతం, కైశికనిషాధం.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | ద | ని | . | స |

గమకంగా మూర్ఛన

అవరోహణ

సా సరి గమ మని ద దని నిప ద దని నిసా

స రి గమ ని ద ని ప ద ని సా

అవరోహణ

స సస నిద మప మగ స

స ని ద మ గ స

అవరోహణ విషయంలో అనేక అభిప్రాయాలు విద్వాంసులలో ఉన్నాయి. అన్ని అభిప్రాయాలు: కూడా రాగభావాన్ని చిత్రీకరించటానికి తోడ్పడేవిగానే ఉన్నాయి .

"సదపగమపగరిసా". అనే ప్రయోగం మూర్ఛనకి భిన్నంగా ఉంది. దీనిని రాగ చివరగా పాడటం సంప్రదాయం.

"నీదపదనిదామ  గామపగరిస" " రిగమపమగ' "నీసదనిపదాపమ" పదనిసద పగమపగరిస" ఇవి అన్ని నాటకురంజి ఆది తాళవర్ణంలోనివి.

ఈ వర్ణంపాఠం చేస్తే రాగం చక్కాగా అవగాహన అవుతుంది. ఈరాగాన్ని ఉప ప్రధానరాగంగా విద్వాంసుని ప్రతిభను బట్టి ముఖ్య రాగంగా కూడా కచ్చేరిలో పాడవచ్చు. రాగం తానం పల్లవి నెరవు స్వరకల్పన పాడటానికి ఈ రాగానికి మంచి అవకాశం (Scope) ఉంది. సొగసైన రాగం. నిర్దుష్టమైన రూపం, రసం, భావం ఉన్నరాగం, అపూర్వ రాగాలకోవలోకి వస్తుంది. ఒక సంగీతానుభూతిని కలుగజేసే రాగం ఇది. ఈ రాగం 'నాట' కురంజి అనేరెండు రాగాలుపేర్లకలయక, కాని ఆరెండురాగాలభావం ఏమాత్రం ఈరాగంలోలేదు. ఈరాగానికి ప్రత్యేకమైన ఒక విలక్షణ మైన అనుభూతిఉంది .

మధ్య, ద్రుతలయల్లో, మంద్రమధ్య, తారాస్థాయిల్లోఈరాగం రాణిస్తుంది. కళాత్మకమైన, కల్పన, విధ్వత్ ధర్మమైన సంప్రదాయ అవగాహన కావాలి ఈరాగం పాడటానికి; విన్యసించి పాడటానికి

వాదిస్వరాలు స. ప.

సంవాదులు స ప; రి ప; గ ద; మ ని; మ స; మ స; రి ద;

జీవస్వరాలు అన్నీ జీవస్వరాలే

'రి''గ' లు తప్ప అన్ని గ్రహన్యాసస్వరాలే.

గ,ద,లకు గమకాలు లేవు.

రంజక ప్రయోగాలతోకూడిన సంక్షిప్తరాగాల్లాపన

మగాసారిసన్నిధ్నీస్తా । మగసరిగామగమా । మానీదా మాపమగసా । గమనిదనిపద నిసా । సనిరిసనిదదసనిపమా మా గమప మాప మగసా । సానీనిదదా । నిదప దనీదా । దామా । నీదానిసా । దనిసారిసనిదనీ; । దనిసారిగమాగసా । నిసరీగ రీసారీసనిదనీ । దనిసరీగామపమగసా । నీసమాగసా । సారీసనిదనీ । దనిసరీగామా . రిగా మా సగ । గామరి । రీసా । దనిసరిగమపగరిసా । దనిరిసదపా । గమపగరిసా సారిసనిద । నీసా.

రచనలు

1. చలమేల తానవర్ణం ఆది
2. మనసు విషయ ఆది త్యాగరాజు
3. నీదుమూర్తిని కనుగొని ఆది పట్నసుబ్రహ్మణ్య అయ్యర్

# నాదనామక్రియ

నాదనామక్రియ 15వ మేళకర్త మాయమాళవగౌళ జన్యం.

నిషాద్ధాంత్యరాగం.

మూర్ఛన

ఆరోహణ సరిగమపదని

అవరోహణ నిదపమగరిసనిసా

స్వరస్థానాలు స,ప,గాక, శురి; అంగా; శుమ; శుద్రై; కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | మ | . | ప | ద | . | . | ని | స |

వాదిస్వారాలు స,ప.

సంవాదులు స–ప; రి–ద; గ–ని; స–మ;

జీవస్వరాలు, స,మ,ని.

అన్నిస్వరాలు గ్రహన్యాసస్వరాలే

ఉపాంగం. జానపద సంగీతంనుండి శాస్త్రీయసంగీతానికి క్రమపరిణామంలో చేర్పబడింది. కరుణ రసప్రధానమైనది. ఉదయం సాయంకాలం పాడతగినది. దీని మండలం యొక్క నిడివి " నిసరిగమపదని" (Range) షడ్జమంమీదగాని

మంద్రనిషాదం క్రిందగానీ పాడితే మాయామాళవగౌళ రాగం అవుతుంది. నిషాధాంత్య ధైవతరీత్యా పంచమాంత్యరాగాలు జానపద సంగీతం నుండి శాస్త్రీయ సంగీతంలోకి చొప్పించబడినవే. జానపద గీతాలు నాదనామక్రియరాగంలో చాలా హృద్యంగాఉంటాయి. పల్లె ప్రజల అమాయకత్వం ఈ రాగంలో గల పాటల్లో ప్రతిబింబిస్తుంది.

ఆరోహణ

స సరీసరి రిమాగమప పదపద దసాని

స రి గమ పద ని

అవరోహణ
సనిపని పద ప పమమా మగమగ సరి సా

ని దపమ గ రి సా

ఈ రాగం పాడినప్పుడు మధ్యమశృతి చేసుకొని పాడాలి. అనగా నియమించుకొనిన శృతికి మధ్యమాన్ని షడ్జమంగా చేసుకొని పాడాలి. పాడితే రంజకంగా ఉంటుంది. తారస్థాయి షడ్జమం పైని ప్రస్థారంలేదు కనుక మధ్యమం చేస్తే పైన వినిపించి ఆకర్షణీయంగా ఉంటుంది. కచ్చేరీలో, ఒకరాగంగా రాగాలాపన, స్వరకల్పన, నెరవు, తానం, పల్లవి మొదలైనవి చేయరు.. కాని చేయవచ్చు ఆక్షేపణ లేదు. తానంపల్లవి కాకపోయినా రాగం స్వరకల్పన చేయవచ్చు. ఇంతపరాకా అనేకృతి నాదనామక్రియలో ఉంది. పెద్దవిద్వాంసులు దినిలో రాగం, నెరవు, స్వరకల్పనవేయడం కద్దు. రాగమాలికలో ఒకరాగంగా బాగుంటుంది.

సంక్షిప్తరాగాలాపన.

సారిమామామాగమప మాపమగరీరిగరిసనిసా । సరీగమపమగమాగరిసని । సారిని । సరిగమా పగమాగరీ । పమగరి రిగరీసా । సరిగమాగరిమాగమపా । మమపదపాదమపగమాగ । రీగమప దపదమాపా । గమపదనీదాపా । మపదానీపదమ పా । గమపదనీదపమ । గమపదదపమా గమదాచపమా । మగపమగమాగరిసని । సారిగారిగామగపమగరీ । పమగరీ:: రిగా రిసనిసా.

రచనలు

1. ఇంత పరాకా
2. ఏ తీరుగనను ఆది రామదాసు
3. పయ్యోదపై త్రిపుట క్షేత్రయ్యపదం.

# నాదవరాంగిణి.

22వ మేళకర్త ఖరహరప్రియ జన్యం.

మూర్చన
అరోహణ స ప మ ని ద ని స

అవరోహణ స ప ని ద ప మ గ రి గ స
స్వరస్థానాలు స,ప,గాక, చరి, సాగా, శుమ చధై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగరాగం. అపూర్వరాగం. వర్జ్యరాగం ఆరోహణలో రి.గ వర్జ్యం ఉభయవక్ర జౌడవ సంపూర్ణరాగం ఉభయవక్రం ఉంటే రాగం స్వరకల్పన మొదలైన మనోధర్మ సంగీతానికి అనుకూలంకాదు. కృతి కూడా అంతంతమాత్రంగానే ఉంటుంది. విస్తృతంగా పాడటానికి వీలుఉండదు. హద్దులు ఎక్కువగా ఉంటాయి. గమకం కూడా తగ్గిపోతుంది.

గ్రహస్వరం స
వాదిస్వరాలు రి,గ,ద.ని
సపమప, గరిగస, నిదనిస, ప్రయోగాలు రాగరంజకాలు
సంవాదులు స-ప; స-మ; మ-ని; ప-స; మ-స;

ఈ రాగం త్యాగరాజస్వామి వారి సృష్టే. ఈరాగం విద్వాంసులుకూడా వినిఉండలేదు అనడం అతిశయోక్తికాదు. దీనిలో త్యాగయ్యవారి రచన తప్ప ఇంకే ఇతరరచనా లేదు. ఈరచనకూడా వినపడటం లేదు.

వాద్యం మీద ఈరచన బాగుంటుందేమో. ప్రయత్నం చేయవచ్చు.
రచన
కృపాలవాలకలాధర ఆది.

# నామనారాయణి (నామదేశి)

నామనారాయణి 50వ బ్రహ్మచక్రంలో రెండవమేళం శ్రీ ప్రస్తారం. సంపూర్ణం సువాదిరాగం

స్వరస్థానాలు స.ప.గాక, శురి, అంగా, ప్రమ, శుని, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | . | మ | ప | ద | . | ని | . | స |

పూర్వాంగం కామవర్ధిని ఉత్తారాంగం తోడి స్వరాలు కలిగిఉంది. పూర్వాగం, ఉత్తరాంగం కలుపుతూపాడాలి.

వాది, సంవాదులు, గ్రహన్యాసస్వరాలు ఈరాగానికి లేవు కారణం ఇది రాగ స్థాయికి చేరుకోలేదు. రాగాంగా రూపోందే స్థితి ఈ మేళ్వానికి ఉన్నది. కృతులు రచింపబడాలి అవి మంచివి పెద్దవి రసవంతమైనవి అయిమంచి విద్వాంసుల! నోటిలోనూ శ్రోతల చెవులలోనూ బాగాపడాలి. అప్పుడుఈ మేళం రాగం అయ్యే అవకాశం ఉంది

**వెంకటమఖి** సంప్రదాయంలో ఈ రాగం 'నామదేశి'

మూర్ఛన సరిగమపదనిస సనిదపమగరిస

రాగాంగం, సంపూర్ణం, షడ్జగ్రహం, ఎల్లప్పుడు గానము సేయదగును.

ఈ రాగ మునకు'నర్మద' అని ఇంకొక పేరు కూడాకలదు. సరిగపదస; పనినిసా, సదపమగ, అనునవి విశేషప్రయోగములు.

రచనలు

1.లక్ష్యగీతము, అరాతరక్షక త్రిపుట వెంకటముఖి.

2.కృతి నర్మదాకావేరి త్రిపుట ముద్దుస్వామి దీక్షితర్

3.సంచారి ఏక సుబ్బరాయ దీక్షితర్.

జన్యరాగ మూర్ఛనలు

1. నర్మద సరిగమదనిస సనిదమపమగరిస

2.హిందోరి సరిగమపనిస। సనిపమగరిస

3.ప్రతాపము సగమపదనిస। సనిదపమసరిస

4. మధుకరి సరిగమపదనిస। సనిదపమగరిస

5. గౌరిమారవ సరిమపదస। సనిదపమగరిగస

6. నవరసగాంధారి సరిగమపమదనిస। సదపమగరిగస

7. మేచకన్నడ సమపదనిస। సనిదపమగస.

# నాయకి

నాయకి 22 వ మేళకర్త ఖరహరప్రియజన్యం.

మూర్ఛన

ఆరోహణ సరిమపదపసా

అవరోహణ సదనీదపమరిగారిస

ఉపాంగం, ఉభయవక్ర ఔడవ సంపూర్ణం అరోహణలో గాంధారనిషాదాలు వర్జ్యా

స్వరస్థానాలు స, ప, గాక చరి, సాగా, శుమ, చద్రై, కైని

గమకంగా మూర్ఛన

అరోహణ

స రి రిమ ప ద ప సా శుమ; చద్రై ; కైని.

స రి మ ప ద ప సా

అవరోహణ

స సద దానిన దాని ప పమ మరి రీగమ రిగరిస
ప ద నీ ద ప మ రి గా రి స

అవరోహణలో నిషాధగాంధారాలు దీర్ఘాలుగా ఉన్నాయి.

ఇవే జీవస్వరాలు కూడాను.

స్వరస్థానాలు

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

వాదిస్వరాలు

స,. ప,

సంవాదులు స ప : స మ; రి ద; రి ప; గ ని; ప మ; మ

గ్రన్యాసాలు స, రి, మ, ప, ద.

గాంధారనిషాధాలు గ్రహన్యాసస్వరాలు కావు. కాని, జీవస్వరాలు.

గాంధారం, నిషాధం. కోమలమైనరాగం చిన్నరాగం, దర్బారు, నాయకి కవలరాగాలు దర్బారు, అన్న నాయకి చెల్లెలు దర్బారు, పురుషరాగం, నాయకి, స్త్రీ రాగం దీనిగాంధార నిషాదాల గమకాలు ప్రత్యేకంగా ఉన్నాయి. ఈ గమకాలకు స్వరం పైన గమక మూర్చనలో ఉదహరించబడింది అలాగే పలకాలి. నాయకి పాడటం కష్టం. బా గా రాగ అవగాహన సూక్ష్మదృష్టిఉంటేగాని సరియైన నాయకి రూపం రాదు. నిర్దుష్టమైన రూపం ఉంది. రసం ఉంది. శృంగారరస ప్రధానమైనది. నాయకి అనడంలోనే ఇది స్త్రీరాగం అని, దీనికి కోమలమైన స్త్రీలక్షణాలు ఉన్నాయి అని వెల్లడి అవుతుంది. కోమల గాంధార నిషాధలే ఈ లాలిత్యాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి. రాగాలాపన, స్వరకల్పన చక్కగా కొంత సేపు చేయవచ్చు. నెరవు తానం పల్లవి పాడటానికి అనువైనరాగం కాదునాయకి. ఎక్కువ అవకాశం లేకపోయినా ఇది చాలా సుందరమైన శ్రావ్యమైన, స్నిగ్ధసుకుమారమైనరాగం మధ్యమ, ద్రుతకాలాలో మంద్ర పంచమంనుండి తార పంచమంవరకు రెండుస్థాయిలలో సాయంకాలం ముఖ్యంగానూ ఎల్లప్పుడూ పాడేరాగం నాయకి.

రాగరంజక ప్రయోగాలతో సంక్షిప్తరాగాలాపన.

సా రీపమదపమరి రిగారిసా । రిసనిసా । పదాపసా । రిమపామరి। రిమపదనీద పమరీ । రీసరిసా రిగరి రిగారిరీసా । రిమపదాప । పాదనీదాపపా పాదప మ పదాప । సా, ప । పాదనీదపమరి రిగారిరీసా । నిసరిమపదాపసా । మపదాపరీసా। దపాసానిరీసా రీ; సారిసనిరిగర రీగారిరీసా । రీపమమారి రీగారీసా । రీస దా । దపసాని సదా । దపాసనిరీసా । సారిస నిసాదపదాప । సాప । పాదనీ దపమరి రీగారీసా। సనిసా పదాపసానిరీసా;;

చనలు

. కనుగొనుసౌఖ్యము రూపకం త్యాగరాజు.

. నీభజనగాన ఆది "

. దయలేనిబ్రతుకేమి చాపు "

# మణిరంగు

మణిరంగు 22వ మేళకర్త జన్యం.

మూర్ఛన

ఆరోహణ సరిమపనిస

అవరోహణ సనిపమగరిస

స్వరస్థానాలు స,ప,లుగాక, చరి, సాగా శుమ, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | . | ని | . | స |

ఉపాంగరాగం రక్తిరాగం. వర్జ్యంరాగం ఆరోహణలో గ,దలు అవరోహణలో ద వర్జ్యం వషాడవరాగం ప్రాచీనరాగం మంచి అందమైనరాగం. కరుణ, భక్తి రసాలకు వాలమైనరాగం.

గ్రహస్వరం స.

వాదిస్వరాలు గని లు

జీవస్వరాలు రి,గ,మ,ని,లు

సంవాదులు స — ప; రి — మ; మా-స; ప-స. గాంధారం న్యాసంకాదు.

మణిరంగు;శ్రీరాగం సోదరరాగాలు పమగరిస మణిరంగు; పమరిగరిస శ్రీరాగం భేదాలు తప్ప. తక్కిన ప్రయోగాలు ఈ రెండురాగాలకు ఒకేవిధంగా ఉంటాయి. ఆలాపన, స్వరకల్పన విస్తృతంగా చేయవచ్చు.

సంక్షిప్తరాగాలాపన

రీపమగరిస। సారిగరిసనిప । పనిస్తరీ । రిమనీపగారి, రిపమగరిస। రిమపనిసా నిపమగారి । సరిపమగరిసనిసరీగరి సనిపపాసనిసా । రిమపనిసనిపమపనిసా। పానిసారీసరిగారీసా పనిసరీమాగరీసా సనిగరిసనిపా । నీపమగారీ సరిపమగరిసనిపపసానిసా

I

రచనలు

1. రానిదిరాదు - ఆది త్యాగరాజు
2. నీకు సరి ఎవరురా - ఝంప- " "
3. మామవపట్టాభిరామ — చాపు - దీక్షితర్
4. జయజయ పద్మనాభ ఆది స్వాతితిరునాళ్.

# మనోరంజని

5వ మేళకర్త మానవతి జన్యం.

ఆరోహణ సరిమపదనిస

అవరోహణ సనిదపమగరిస

స్వరస్థానాలు స, ప, గాక శురి, శుగా, శుమ, చద్రి, కాని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | మ | . | ప | . | ద | . | ని | స |

ఉపాంగరాగం, షాడవ, సంపూర్ణం, వివాదిరాగం.

త్యాగరాజస్వామివారు ప్రకాశింప చేసిన రాగము. వీరికృతి తప్ప ఈరాగమున ఇంకొక కృతి కానవచ్చుటలేదు.

కృతినిపాఠం చేసినతరువాత అందుగల ప్రయోగములు, నడకలననుసరిం రాగము స్వరకల్పన పాడవచ్చును.

సంక్షిప్తరాగాలాపన

సరిమాగారీసా । సారిస్ననిద్దనీస్తా । సరిమపదాప । పాదదపమగారీసారీమ మప దనిస్తారిస్త నిదాపా । పాదానీసా । సారిమా । గారీసా । దరిసనిద మపదాప । దపప మగారీసా ॥

రచనలు

1. అటుకారాదనిపల్క-ఆది-త్యాగరాజ స్వామి.

# మనోహరి

22వ మేళకర్త ఖరహరప్రియజన్యం

మూర్ఛన

ఆరోహణ సగరిగమపదస

అవరోహణ సదపమగరిస

స్వరస్థానాలు స,ప,లు గాక చరి, సాగా, శుమ, చద్రై

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | . | . | స |

ఉపాంగరాగం అపూర్వరాగం. వర్జ్యరాగం మూర్ఛనలో నిషాధంలేదు. వక్రషాడవ షాడవం, రక్తిరాగం.

గ్రహస్వరం స.

వాదిస్వరాలు జీవస్వరాలు గ,ద,లు

సంవాదులు సప; సమ; రిప; రిద; మస; పస; కరుణరసప్రధానం రాగాలాపన స్వరకల్పన చేయవచ్చును. విద్వాంసులు పూనుకోన్నచో ఈరాగము ప్రసిద్ధము అగుటకు అవకాశము కల దు.

ఈరాగమును త్యాగయ్యవారు సృష్టించారు. త్యాగరాజస్వామి మనోహరి రాగంలో ఒక ముఖ్యమైన కరుణ రసప్రధానమైన కృతిని రచించారు. తన జీవితము సమాప్తమగుటకు పదిరోజులకు ముందు ఒక తన్మయావస్థలో ఈ కీర్తనను రచించి పాడిరి.

చరణములో వరమగు బంగారు యోడలో మెరయుచు పదిపూటలపై కరుణించెదన నుచును త్యాగరాజునితో

పల్లవి పరితాపముగని యాడినమాటలు మరచితివో - రూపకం.

# మలయమారుతం

మలయమారుతం 16వ మేళకర్త చక్రవాకం జన్యం.

మూర్ఛన

ఆరోహణ సరిగపదనిసా

అవరోహణ సనిదపగరిస

స్వరస్థానాలు స,ప,గాక, శురి;అంగా;చద్రై;కై.ని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | . | . | ప | . | ద | ని | . | స |

వాదిస్వరం స

సంవాదులు స–ప; గ–ద; ఛ–స;

జీవస్వరాలు స,ప,రిని

అన్నిగ్రహన్యాసస్వరాలే

ఉపాంగం;వర్జ్యరాగం మూర్ఛనలో 'మ'వర్జ్యం. షాడవరాగం ఉదయంరాగం కరుణ రసాన్ని కలుగచేస్తుంది.

గమకంగా మూర్ఛన.

ఆరోహణ స సరి గ ప ద దని నిసా

స రి గ ప ద ని సా

అవరోహణ స సని దని ప పగ గరి సా

స ని ద ప గ రి సా

రక్తిరాగం రాగాలాపన స్వరకల్పన, మొదలైన మనోధర్మసంగీత అంశాలు అ యిందింటినీపాడవచ్చు. కరుణ రసం కొంచెం ఎక్కువగానే వినిపిస్తుంది ఈరాగం లో అందు చేత ఆకర్షణ తక్కువగా ఉండవచ్చు. కరుణరసానికి కారణం త క్కిన స్వరాలు జతతో శుద్ధరిషభం. కారణం, మధ్యమ దురిత కాలాల్లో మూ డు స్థాయిల్లోనూపాడవచ్చు

క్లుప్తంగా రాగాలాపన

గపరీసాని̤ని̤ధ̤పాధ̤ని̤స్థా । సారిగాపా । గపదనీదపా । గదపగరీసా ।
సారీగగాపా । గపదానీదా । దానీదాపా । గపదనిపదగపా । నిదదపగరీ । గపగరీసా ।
గపద నీనిదదా నిదపగాపదాపదనిసా దనిసారిసరీరీరీ గపగరీసా సనిరిసనిదపా
గపదనిదాపా గదపగరీసా

రచనలు

మనసాఎటులోర్తునే -రూపకం-త్యాగరాజు.

# మలహరి

మలహరి 15వ మేళకర్త మాయామాళవగౌళజన్యం

రస్థానాలు స,ప,గాక, శురి, అంగ, శుమ, శుదై.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | మ | . | ప | ద | . | . | . | స |

హార్చన

రోహణ సరిమపదస

ంవరోహణ సదపమగరిస

ఉపాంగరాగం జౌడవషాడవరాగం వర్జ్యరాగం. పూర్వం వాడుకలో ఉన్నరాగం ఎనికంగా అంతగా వాడుకలోలేదు.పురంధరదాసులవారు అభ్యానగాన రచనలు చేసిః ్నాటకసంగీతపితామహుడు. వారు పిళ్లయారి (వినాయకుడు ) గీతములు రచించార ్రశిగణనాథం 2 కుందగౌర 3 కేరయనీరను 4 పదుమనాభ అనేగీతములు మలహరి 'గమునందే రచించారు. వారుఈ గీతములు రచించిన కాలమునందు మలహరిరాగమ ్రసిద్ధంగా నుండి యుండవచ్చును. ఈ రాగముస్థానే ప్రస్తుతం సావేరిరాగం ప్రసిద్ధంగ న్నది. ఈ రెండురాగములకు అవరోహణ యందు నిషాధము మాత్రమే భేదము.

మలహరి అవరోహణ సదపమగరిస

సావేరి " సనిదపమగరిస

సావేరివాడుకలో నికి వచ్చిమలహరి రాగమును గ్రహణము పట్టించినది.

మలహరి అనగా మలినమును పోగొట్టురాగము అని అర్థము శుభప్రథమైన 'గము

వాది, గ్రహస్వరములు స,మ,ద

సంవాదులు స- ప;రిద;సమ;సప;మస;పస;

ఈరాగమును ఇప్పుడు ఆలాపన చేసినచో వినికిడిజ్ఞానము మాత్రమే కలిగినవారు. సావేరి అని అనుకోనుటకు అవకాశము కలదు.

రచనలు

1. పంచమాతంగముఖ-గణపతినా-దీక్షితర్

# మానవతి (మనోరంజని)

మానవతి 72వ మేళకర్తల పథకమునందు మొదటి ఇందు చక్రమున

అయిదవమేళము మ ప్రస్తారము స,ర,గ,మ,ప,ది,ను సంపూర్ణసంపూర్ణ

కటపయసూత్రము ననుసరించి న=0, మ-5 5వ మేళం

శుద్ధగాంధారం ఉంది కనుక ఇది వివాదిరాగం.

పూర్వాంగం సరిగమ కనకాంగి, ఉత్తరాంగం పదనిస శంకరాభరణం

స్వరస్థానములు స,ప,గాక, శురి,శుగా, శుమ, చద్రై, కాని

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | మ | . | ప | . | ద | . | ని | స |

సనిదనిసా సరిస గమాపదనిసారిసా సనిదమగమగరిసా అనిపాడితే వివా

దిత్వంఉండదు.

ఇది మూర్ఛనకారకమేళం

దీని మధ్యమం గ్రహంచేస్తే 61వ మేళం కాంతామణి వస్తుంది ఈరాగానికి వెంక

టముఖి సంప్రదాయంలో మనోరంజని అనిపేరు. కటపయాది సూత్రనికి సరిపో

తుంది. 5వ మేళం అవుతుంది.

మనూరంజని అసంపూర్ణమేళం సరిమపదనీస సనిదపమరిగరిస

రచనలు

1. గీతం ఉఝళిత త్రిపుట వెంకటముఖి
2. తానం
3. కీర్తనం బాలాంబికే పాహి మత్య దీక్షితర్
4. సంచారి ఏకతాళం సబ్బరాయదీక్షితర్

ఇందు జన్యరాగం.

ఘనశ్యామల సగమపదస సనిదపమగరిస

ఈరాగ మధ్యమాన్ని గ్రహంచేస్తే 61వ మేళం కాంతామణివస్తుంది.

# మాయామాళవ గౌళ

మాయామాళవగౌళ 15వ మేళకర్త 3వ అగ్నిచక్రం లో 3వరాగం 'గో' ప్రస్తారం రాగాంగరాగము, షడ్జగ్రహము

స్వరస్థానాలు స,ప,గాక, శురి;అంగా;శుమ;శుద్రై;కాని సంపూర్ణం

మూర్చన

ఆరో సరిగమపదనిస

అవరోహణ సనిదపమగరిస

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | మ | . . | ప | ద | . | ని | ని | స |

అనెక జన్యరాగములు కలిగిన మేళరాగము. ఈ మేళము మేళదశను అధిగమించి రాగదశకు చాలాకాలము క్రిందటే చేరినది. నిర్దుష్టరూపము కలిగినరాగము. శాంత, భక్తి, కరుణరసములను వ్యక్తీకరించురాగము పూర్వాంగ ఉత్తరాంగములకు సరియైనసంపూర్ణమైన జవాబు (Symmetry) గలదు.

అది ఎటులనిన

పూర్వాంగము స రి . . గ మ

ఉత్తరాంగం ప ద . . ని స

అందువలన సంవాదులు చాల కలవు ఎక్కువ సంవాదులు గల రాగము సంగీతవిలువల అత్యంతము కలిగి శ్రావ్యతను ఇతోధికముగా పొందును.

కర్ణాటక సంగీతపితామహుడు అను బిరుదు పొందిన శ్రీపురందరదాసువారు ఈరాగమున, సరళీవరుసనలు జంటవరుసలు, అలంకారమలు ఇందు జన్య మైన మలహరి రాగము నందు రచించి శిష్యులకు శిక్షణనిచ్చి. బహుళ ప్రచార మును గావించిరి.

ఈరాగములోగల శురి, అంగా, శుమ, శుధై, కాని స్వరములు వికృతిచెందక స్వకీయవిలువలు కలిగి ప్రకాశించుచున్నవి. సరి, గమ, పద, నిస, ఇవి ప్రక్కప్రక్క

స్వరములు గానుండి, కవలస్వరములుగాప్రసిద్ధిగాంచినవి అందుచేత స్వరములను। పాడుటకు సులభమని పూర్వాచార్యులు భావించిరి.

వాదీ స.

సంవాదులు స-ప స మ రి ద గని మస

గ్రహన్యాసాలు స,గ,ప. ఇది మూర్ఛన కారకమేళం. మాయామాళవగౌళ రిషభ గ్రహంచేస్తే 72వ మేళకర్త రసికప్రియ, మధ్యమం గ్రహంచేస్తే 57వ మేళకర్త సింహేంద్రమధ్యమం వస్తుంది.

దీని జన్యం అయిన సావేరి ఈరాగంకంటే ప్రసిద్ధం అవడంచేత

సావేరి పాడడం ముందుగా వస్తుంది. సావేరిలో రి,ద,మా, గ్రహన్యాసస్వరాలు మాయామాళవగౌళ పాడాలంటే। స,ప,గ, గ్రహన్యాసాలు చేసుకుంటే రాగభావాన్ని బాగాతీసు కురావచ్చు.

క్లుప్తంగా రాగం.

సారినిసరిగామగపమగరీ । రిగరిససా । సారిగమపమగరిసా । సరిగమపదాపా పాదపమగమపా దపమగమగమపామ। పదనీపదమపా । గమపదనిదపమగ గామ పామపదాపదానీదసానిసా । నిసరిగారి రీసారిరిససా । సారిగమపమగరీరిసరీ। సా సానీపాదమపా । మగమపమపమగరిరీరిగరిగరిససా । ఈరాగాంలో జన్యాలు వాటి మూర్ఛనలు

| | |
|---|---|
| సావేరి | సరిమపదస సనిదపమగరిస |
| జగన్మోహిని | సగమపనిస సనిపమగరిస |
| గౌళ | సరిగమపనిస సనిపమగరిమరిస |
| భౌళి | సరిగపదసా సనిపగరిస |
| సారంగనాట। | సరిమపదస సనిసదపమగరిస |
| నాదనామక్రియ। | సరిగమపదని నిదపమగరిస |
| మేచభౌళి | సరిగపదస సనిదపగరిస |

గుమ్మకాంభోజి సరిగపదనిస సదనిపమగరిస
రేగుప్తి సరిగపదస సదపగరిస
మలహరి సరిమపదస సదపమగరిస
సాళంగనాట సరిమపదస సదపససనిసగపమగరిస
మంగళకైశిక సమగమపమదనిస సనిదపమగరిస
లలితపంచమం సరిమదనిస సనిదపమపమగరిస
మారువ సగమపదనిదపస సనిదపమగమపమగరిస.
శుద్ధక్రియ సరిపమపదస సదపమగరిస
మేఘరంజి సరిగమపనిస సనిమగరిస
పాడి సరిమపనిస సనిపదపమరిస
పూర్ణపంచమం సరిగమపద దపమగరిస
ఘనసింధు సమగమపదనిదస సనిదపమగరిస
సురసింధు సమగమపదనిదస
దేశ్యగౌళ సరిసపదనిస సనిదపసరిస
గౌరి సరిమనిస సనిదపమగరిస
సింధురామక్రియ సగమపదనిస సనిపదపమగస
గౌళీపంతు సరిగరిమపదపనిస సనిదపమగరిస
సౌరాష్ట్రము సరిగమపదనిస సనిదపమగరిస
ఆర్ద్రదేశిక సరిగమపదనిస సదపమగరిస
మూర్జరి సరిగమపదనిస సదనిపమగరిస
గుండక్రియ సరిమపనిస సనిపదపమగరిస
ఫరజు సరిగమపదనిస సనిదపమగరిస
లలిత సరిగమదనిస సనిదమగరిస
కమలామనోహరి సగమపనిస సనిదపమగస.

ఈ రాగమునందు గల రచనలు

1. మాయాతీతస్వరూపిణి తంజావురు పొన్నయ్య.
2. మేరుసమాన ఆది త్యాగరాజు
3. విద్ములకు మ్రొక్కెద ఆది త్యాగరాజు
4. లక్ష్యగీతము రవికోటితేజ మఠ్య వెంకటమఖి
5. శ్రీనాథగురుగుహోజయతి ఆది ముద్దుస్వామి

ఈరాగం రిషభాన్ని గ్రహించేస్తే 72ల మేళం రసిక ప్రియ వస్తుంది.

" మధ్యమం " 57 " సింహేంద్రమధ్యమం.

# మారరంజని (శరావతి)

మారరంజని 25వ మేళకర్త 5వ బాణచక్రంలో మొదటి రాగం 'ప'్రస్తారం స్వరస్థానాలు స,వ,గాక, చరి, అంగా శుమ, శుద్ధై, శుని

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | ద | ని | . | . | స | |

పూర్వాంగం శంకరాభరణం, ఉత్తరాంగం కనకాంగి. పూర్వాంగ ఉత్తరాగంస్వరాలను కలిపి పాడాలి నిసరిమపదపా ఇలా పాడితే వివాదిత్వం పోతుంది.

సంక్షిప్తరాగాలాపన

గమపదాపా | మాగారీగమపాదదపపమమా పాదపదనీనని పా | దపమమపదాపాదప నీసా | సానీదాపా | పాదాపనీ;సారీస | సరిగమపరిగసా నీసరీసానిదాపా | మపదమపా మగరీమగరిసా నీదాపానీసా ఈ మేళం మూర్ఛనకారకం పంచమం గ్రహంచేస్తే 4వ మేళకర్త వనస్పతి వస్తుంది.

వెంకటముఖి సంప్రదాయంలో ఈరాగం శరావతి మూర్ఛన సమగమ పదనిదస స నీదపమగరిస

రాగాంగం సంపూర్ణం, షడ్జగ్రహం ఎల్లప్పుడును పాడదగును.

రచనలు

1. లక్ష్యగీతం రిపుచాపు రూపకం వెంఖటముఖి,
2. చిట్టితానం
3. కీర్తన శరావతితటవాసిని త్రిసేక దీక్షితర్
4. సంచారి త్రిపుట సుబ్బరాయదీక్షితర్

ఇంటు

మూర్ఛనలు కల్లోలసావేరి సరిమపధస సనిదపమగరిస

కేసరి సరిగమపదపస సదనిదపమగరిస

దేశముఖారి సరిగమపదనిదస సదనిదపమగరిస

దేవసాళగము సగపదనిస సపదనిదపమగరిస

భానుప్రతాపము సరిగమపదస సదపమగరిస

రమ్యపంచమం సరిగమపదనిస సదపమగరిస

శరద్యుతి సరిగమపదనిస దసనిదపమగరిస

సింహాళవసంతం సరిగమపదనిస సగపమగరిస

# మారువధన్యాసి

మారువధన్యాసి 22వ మేళకర్త ఖరహరప్రియజన్యం

మూర్ఛన ఆరోహణ సగమపదసా

అవరోహణ సనిదపమదమగరిసా

స్వరస్థానాలు స ,ప,గాక, చరి;సాగా;శుమ;చద్వై;కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | . | ని | స |

అపూర్వప్రయోగం మపనిస వాది స

సంవాదులు సప సమ రిప గని రిద ప స మస

జీవస్వరాలు స,ప,గ,రి,ద,ని మ

నిషాధం గాందారం తప్ప అన్నిగ్రహన్యాసస్వరాలే

చాలా వక్రంగా ఉండడం మూలంగా రాగం పాడటానికి వీలుతక్కువ అపు రాగం. ఉపాంగం వర్జ్యరాగం ఆరోహణలో రి,ని, లేవు జౌడవ వక్రసంపూర్ణం ఈరా త్యాగరాజస్వామివారి సృష్టి

ఈరాగం కృతిని ఆశ్రయించుకొని ఉన్నది. నిర్ధష్టరూపం శ్రోతలలో ఇంకా రూపొందలేదు.

పెద్దవిద్వాంసుడు కల్పనాచాతుర్యం సంప్రదాయదృష్టి ఉండి ఈరాగాన్ని ప్రసిద్ధించేయవచ్చు. రచనలు మృదుభాషణా ఆది త్యాగరాజు.

# మార్గహిందోళ

మర్గహింధోళ 20వ మేళకర్త నఠభైరవి జన్యం

మూర్ఛన

ఆరోహణ సరిగమపదనిసా

అవరోహణ సనిదపమగరిగరిస

స్వరస్థానాలు స,ప,గాక, చరి,కసాగ, శుమ, శుధై, కైని

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | . | మ | . | ప | ద | . | ని | . | స |

ఉపాంగం, సంపూర్ణం వక్రసంపూర్ణరాగం

రక్తిరాగాల్లో రెండవశ్రేణిలోకి చేరినది. రాగం స్వరం పాడటానికి వీల్లులేదు

;నిర్ధుష్టమైన రూపం లేదు గనుక కీర్తన మీద ఆధారపడినరాగం ఇది

నఠభైవరవి రాగమే ఆరోహణలో వక్రం 'దమ' అనేప్రయోగం వినా నఠభైరవికే

రూపం లేదు. రూపంలేఃపోయినా రసంరసం ఉంది. కరుణరసం

వాది స

సంవాదులు స–ప; స–మ; రి–ప; గ–ని; మ–ని;

జీవస్వరాలు స గ ని మ.

గ్రహన్యాసాదులుులు స రి, మ,

రచనలు చలమేలరా సాకేతరామ ఆది త్యాగరాజు

# మాళవి

మాళవి 28వ మేళకర్త హరికాంభోజిజన్యం

మూర్ఛన

ఆరోహణ సరిగమపనిమదనిస

అవరోహణ సనిదనిపమగమరిస

స్వరస్థానాలు స,ప,గాక, చరి, అంగా, శుమ, చద్రై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | ప | . | ద | .ని | . | స |

వక్రసంపూర్ణం, ఉపాంగం, అపూర్వరాగం

రాగంమొదలైన మనోధర్మసంగీతరీతులను పాడటానికి అనువైనరాగం కాదు. దు. చిన్నరాగం కృతి ఆధారంగా ఉన్నరా గం. ఈరాగం త్యాగరాజస్వామివారి భిక్ష.

వాది స

సంవాదులు స – ప ; స–మ; రి–ద; గ–ద; మ–ని; మస; పస

జీవస్వరాలు, స,మ,ని

గ్రహన్యాసాలులు స,మ,ద,ని

రచనలు

నెనరుంచినాను. ఆది త్యాగరాజు.

# మాళవశ్రీ

మాళవ శ్రీ 22వ మేళకర్త ఖరహరప్రియజన్యం

ఆరోహణ మనిదనిపదనిసగమప

అవరోహణ పగమగసనిదనిపమ

స్వరస్థానాలు స,ప,గాక, సాగా, శుమ, చద్రై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | .. | . | గ | . | మ | . | ప. | ధ | ధ | ని | స | స |

ఉపాంగరాగం అపూర్వరాగం చిన్నరాగం

ఉభయవక్రషాడవరాగం రి వర్జ్యస్థాయి మధ్యమమునుండి మధ్యస్థాయి పంచమమువరకు మంద్రండున్నది. దీక్షితర్ కృతి కూడా ఇంతవరకే ఉన్నది ఈరెండుకృతునలనుబట్టి వాటియందు గల ప్రయోగములనును బట్టి స్థాయి పరిమితినిబట్టి, చూచిన ఈరాగము మధ్యమశృతిలో పాడదగినది అని తోచుచున్నది. (జంఝూటి పున్నాగవరాళి) వలె) పంచమాంత్యరాగం. ఈరాగము జానపదసంగీతసంప్రదాయమునుండి గ్రహింపబడియున్నది.

ఉభయ వక్రం అగుటవలన రాగంపాడుట అసాధ్యము. ఈ రాగము కీర్తనను ఆధారముగ చేసుకొని నామమాత్రముగా జీవించుచున్నది. దీనికి రరాగరూపము లేదు.

రచన

ఎన్నాళ్లుతిరిగేది ఆది త్యాగరాజు.

# ముఖారి

ముఖారిరాగం 20వ మేళకర్తనఠభైరవి జన్యం భాషాంగరాగం వర్జ్యరాగం ొడవసంపూర్ణం. పూరాతనరాగం కరుణరసప్రధానరాగం

స్వరస్థానాలు స్వప, గాక చరి, సాని, శుమ, శుధై (చద్రై) కైని

చతుశృతి దైవేతం అన్యస్వరం.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | ద | ద | ని | స |

మూర్ఛన
ఆరోహణ సరిమపదన
అవరోహణ సనిదపమగరిస

మూర్ఛన యందు ఆరోహణ యందు అన్యస్వరముకలదు. భైరవిరాగము నందు
3. ఆరోహణ యందు గ, ని, లు లేవు.

అపూరూప సంచారాలు నిదమపదసా | మగరిగసా సనిదపదసా |

సంక్షిప్తరాగాలాపన

రీపమ గరిరీగసా । సారిస్సనిధాస్సా । దనరిమాగరిగసా । రిమపాదపమాపమ గరీసా
ాపాననినిదాామ పాదసానినిదపా । పదసరీ;; రీగసారీపమగరిరీగ సా సానిదపమాపమ
రీగసా। రిమపాదరిసనీదాపా। రిమపాదపమాపమగరి సరీపమగరిరీగసా । ససన్నిధామపధాసా
రిరీగసా సనన్నిధామపధాస్సా |

# మేచకళ్యాణి (శాంతకళ్యాణి)

మేచకళ్యాణి 65వ మేళకర్త 11వ రుద్రచక్రంలో 5వ రాగం 'మ'ప్రస్తారం రాగాంగం, సంపూర్ణం సువాది ప్రసిద్ధం

మేచ అనుపదము కళ్యాణికి చేర్చబడి కటపయాది సూత్రమునకు సరిపోవునట్లుగా రూపొందించబడినది.

మేచకళ్యాణిరాగము అతిప్రసిద్ధమైనరాగం. ప్రాచీన మైనకళ్యాణిరాగము 72వ మేళకర్తల పధకమున 65 మేళముగా స్వరస్థానముల విన్యాసమునందు లెక్కకు సరిపోయినది. లక్షణ విషయముల

కళ్యాణిరాగం లక్షణమున వివరింపబడినవి.

వేంకటముఖి సంప్రదాయమున ఈరాగము 'శాంతకళ్యాణి' గ,రి, జీవస్వరములు. రచనలు

1. లక్ష్యగీతం రేరేశ్రీశూలిని త్రిపుట వెంకటమఖి
2. కృతి భజరేచిత్తబాలాంభికాం త్రిసఏక ముద్దుస్వామిదీక్షితర్
3. కమలాంబాంభజరే ఆది దీక్షితర్

   శ్రీమంగళాంబికే ఆది దీక్షితర్
4. కాంతిమతి కరుణమీర రూపకం దీక్షితర్
5. పదము దాని ప్రాయము పదారేండ్లు ఆది సారంగపాణి.
6. తానవర్ణ వనజాక్షి ఆట పల్లవి గోపాయ్యా
7. కృతివేణుగోపాలం ధాతు మిశ్ర ఏక కృష్ణస్వామి అయ్యర్
8. స్వరస్థానపదం మిశ్ర ఏక ధాతు సుబ్బరాయదీక్షితర్ మాతు నారాయణస్వామి అయ్యర్ పారిక్కన్నిసదా.

   సాహిత్యార్థము తమిళ విద్వాంసుల వద్ద నేర్చుకొనవలెను.
9. సంచారి రగణమత్య తాళం సుబ్బరామదీక్షితర్

వాదిస్వరం మ.

గ్రహస్వరం స

సంవాదులు స ప; సమ; రిప; రిద; గద; గని; మస; పస;

జీవస్వరాలు రి,గ,మ,ద,ని, స,ప.

గ్రహన్యాసస్వరాలు స,రి,మ,ప,గ,ద,ని న్యాసస్వరాలు గ్రహస్వరాలకావు.

౨) రాగాలాపన,.. స్వరకల్పనకు అనుకూలమైనరాగం. చిన్నరాగమైనా నిర్దుష్టమైన రూపం (కరుణ) రసం ఉన్నరాగం. రక్తిరాగం. గా,మా,నీ, లకు కంపిత గమకం కలదు. దీనివిడివి మంద్రపంచమం నుండి తారపంచమంవరకు కలదు. ముఖ+అరి = ముఖారి. మూఖానికి శత్రువు అనగా ఈరాగము శోకభావమును వ్యక్తీకరించును. 'గను క ముఖము వికృతముగానుండునని అర్ధము అయిఉండవచ్చును: ఈ రాగముపాడిన తరువాత, మధ్యమాంతగాని, సురటిగాని శ్రీరాగం, కళ్యాణిగాని పాడితే దోషము పోవును.

రచనలు

1. ఆది తాళవర్ణం
2. ఎంతనినేవర్ణంతునురూపకం త్యాగరాజుస్వామి
3. క్షీణమైతిరుగ ఆది త్యాగరాస్వామి
4. ఏమనినే చాపు సుబ్బరాయశాస్త్రి.

ఇందుజన్యరాగములు

1.కౌమోద సరిగమనిస | సనిమగరిస

2.యమునా కల్యాణి సరిగపమపదస | సదపమపగరిస

3.కుంతలకుసుమావళి సగమపదనిస | సనిపమగరిస

5.మైత్రిభావిని సరిగమపదనిస | సదపమగరిస

6.హమిర్ కళ్యాణి సపమపదనిస | సనిదదపగమరిస

# మోహన

మోహన 29వ మేళకర్త ధీరశంకరాభరణ జన్యం

ఉపాంగరాగం, వర్జ్యరాగం, ఔడవరాగం, బహుళప్రసిద్ధమైనరాగం. ప్రపం

పంచమున అన్ని సంగీతరీతులలోనూ ఈ రాగము ఉన్నది దేశదేశములందుగల జానపద సంగీతమున ఈ రాగము బహుళప్రచారముగ ఉన్నది.

మూర్ఛన

ఆరోహణ సరిగపదస

అవరోహణ సదపగరిస

ఇందు మధ్యమనిషాధములు వర్జ్యము.

స్వరస్థానములు షడ్జ, పంచమములుగాక చతుశ్శృతిరిషభం;
అంతరగాంధారం;చతుశ్శృతిధైవతం.

స్వరస్థానములు

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | . | . | | ప | . | ద | . | . | స |

ఇది చాలా అవకాశముగలరాగము. ప్రసిద్ధరాగము నిర్దుష్టమైన రూపం, రస, భావములు కలిగినరాగము, రాగాలాపన, నెరవు, స్వరకల్పన, తానం, పల్లవి పాడుటకు అనువైనరాగం. త్రిస్థాయిరాగం **విళంబమధ్యధృతలయలుగా** గలరాగము. అన్నివేళలయందు పాడతగురాగము. శృంగార, భక్తి శాంత, వీరరసప్రధానమైనరాగము. శ్రోతలకు సులభముగా **బోధపడురాగము పాడుట** సులభము **ఆస్వాదించుట** సులభము. తక్కువస్వరములే ఉన్నను ఎక్కువ రక్తికలిగినరాము. గానకచ్చేరీ యందు ముఖ్యరాగముగా పాడుటకు యోగ్యమైనరాగము. సమ్మోహనమైనది, మోహనకరమైనది, అందమైనరాగము. రాగము.

మధ్యమనిషాధములు లేనికారణంగా స్వరకల్పన ధృతకాలమున చేయుటకు కష్టపడవలసి యుండును. నాటకపద్యాలు పద్య, శ్లోకపఠనానికి, వర్ణనలు

అనుకూలమైనరాగము, ఎక్కువ సంఖ్యరచనలను గల రాగము. జానపదకీర్తనలు, భజన కీర్తనలు ఈ రాగంలో ఉంటాయి.

హిందూస్థాని సంగీతంలో మోహనను భూప్, భూపాల్, దేశికార్ అని అంటారు.

ఈ రాగంసర్వవస్వర మూర్ఛనకారక రాగం.

| | |
|---|---|
| మోహన | స.రి.గ..ప.ద..స |
| మధ్యమావతి | ని.స.రి..మ.ప..ని |
| హిందోళ | ద.ని.స..గ.మ..ద |
| శుద్ధసావేరి | మ.ప..ద..స.రి..మ |
| ఉదయరవిచంద్రిక | గ.మ.ప..ని.స..గ |

మోహన రిషభాన్ని గ్రహంచేస్తే మధ్యమావతి
" గాంధారాన్ని " హిందోళ
" పంచమాన్ని " శుద్ధసావేరి
" ధైవతాన్ని " ఉదయరవిచంద్రిక వస్తాయి.

వాదిస్వరంస,ప.

సంవాదులు స - ప; రి - ద; రి - ప; గ - ద; ప - స;

జీవస్వరాలు అన్ని జీవస్వరాలే

గ్రహన్యాసస్వరాలు అన్ని స్వరాలు గ్రహన్యాసస్వరాలే.

రాగరంజక ప్రయోగాలతో కలిసిన సంక్షిప్తరాగాలాపన

గాదాపదాప <u>గరీ</u> సరీదాపసా \ సారిగాపరీరిగారిసదసా । గాగాపాపాపా పగదపగపగరీస । గపదాసదదపపా \ గగపదాప గపదాసా <u>దపపా</u> <u>గరీస</u> రీదాసా సాగరీపగాద పాసదసా \ సదరిసదపాదాగాపాదసా । దాదసదాపా గాదాపదాపగరీ

గపదాగపదా । దారిసదపదా । దపగరిగపదా । దాసాసా సద.సా ।
దపగరిగపదా । దాసాపాసదసా । దాసారీరీ సాగరిరీన సా
గపరిసారిగారిరి ససదప ద్రాపదసా । దసదపగ రిగరిగాపద
దాపగారి రీగాసాపా రీదానపాపాదసా రిగపరీసా
దాపపాదపపాగారీరిరీగపాగరిరీసారీదాసా.।

రచనలు

1. నిన్ను కోరి – తానవర్ణం ఆది
2.ఎవరురా చాపు త్యాగరాజు
3.ననుపాలింప – ఆది త్యాగరాజు
4. రామానిన్నేనమ్మి "
5.మోహనరామ "
6. భవనుతనాహృదయము "
7. నాగలింగం – దీక్షితర్
8.రారారాజీవలోచన – చాపు త్యాగరాజు
10.వేదవాక్యమని – చాపు– త్యాగరాజు.

# మోహనకళ్యాణి

మోహనకళ్యాణి 65వ మేళకర్త మేచకళ్యాణి జన్యం.

మూర్ఛన ఆరోహణ సరిగపదస

అవరోహణ సనిదపమగరిస

స్వరస్థానాలు స,ప,గాక,చరి, అంగ, ప్రమ, చధై,కాని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | . | మ | ప | . | ద | . | ని | స |

ఉపాంగం. వర్జ్యరాగం. ఆరోహణలో మ,ని, లేవు.

ఔడవ సంపూర్ణం.

ఆరోహణ మోహన అవరోహణ కళ్యాణి

ఈ విషయం పేరులోనే ఉంది. పేరు మూర్ఛనని స్ఫురింప చేస్తోంది బలహరికి ఈ రాగానికి మధ్యమమేభేదం.

రక్తిరాగం నేర్చుకావాలి పాడటానికి. పాడటానికి అలవాటుకావాలి విని రసించటానికి, తెలిస్తే ఆనందం ఎక్కువగదా!

రాగం, స్వరంపాడవచ్చు. పెద్దరాగంకాదు నిర్దుష్టమైనరూపం ఇంక ఎందుకోరాలేదు.

మూర్ఛననిబట్టి, కృతిని ఆధారం చేసుకొనిరాగం, స్వరం పాడవచ్చు.

వాది స

సంవాదులు స-ప; రి-ప; గ-ధ; ప-స; ని-మ; ని-గ;

జీవస్వరాలు స,ప,మ,

గ్రహన్యాసాలు మ,ని, లు తప్ప అన్ని

రచనలు

1. సేవే శ్రీకాంతం.

# యదుకులకాంభోజి

ఈ రాగం, 28వ మేళకర్త హరికాంభోజి జన్యం. భాషాంగం. ఔడవ సంపూర్ణ వర్జ్యరాగం. ఆరోహణ యందు గ, ని, లు వర్జ్యం అవరోహణసంపూర్ణం.

మూర్ఛన

ఆరో సరిమపదసా

అవ సనిదపమగరిస

స్వరస్థానాలు స,ప,గాక చతుశృతిరిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమ చతుశృతిధైవతం, కైశికనిషాధం.

దనిసారి సనిసనీద గమపాదపమపమాగ

అపూరూపమైనరాగరంజక ప్రయోగాలు దనిస;గమప మూర్ఛనలో లేవు ఈరాగం కొంతవరకు ప్రయోగప్రధానమైనరాగం. సనిధా అనే ప్రయోగంలో కాకలినిషాధం వస్తుంది; కాంభోజిలోవలె. విళంబంలో రాణిస్తుంది. మంద్రపంచమంనుండి తారపంచమం వరకు రెండుస్థాయిలో రాణిస్తుంది. భక్తిశాంతరసాలు ఈ రాగానికి సరిపోతాయి. అనుభవంతో ఈ రాగం పాడాలి. రాగం పెద్దదికాకపోయినా నిర్దుష్టరూపం ఉంది. దీనిలో కృతులు తక్కువే. ఇది అపూరూపరాగాల కోవలోకివస్తుంది. క్తిరాగం కర్ణాటక శుద్ధమైన శైలి కలిగినరాగం. ఎక్కడా కాంభోజి స్ఫురించకుండా ాడటం కష్టం. కాంభోజి, యదుకులకాంభోజి సోదరరాగాలు. రాగం ఎక్కువ ేపు పాడితేపునరుక్తికి అవకాశం ఉంది స్వరకల్పన, నెరవు, రాగాలాపన పాడడానికి ునువైనరాగం కాదు. రాగం కొంతసేపు పాడవచ్చు. చాలా అందమైనరాగం ాగమాలిక శ్లోకాల్లో ఒకరాగంగా బాగుంటుంది. రాగం కృతి పాడి ఆపితే బాగుంటుంది.

గమకంగా మూర్ఛన

ఆరోహణ స నగరీ రీపమపమవమ ప పాసదసదసాధ నగసా
స రి మా ప దా స.

అవరోహణ స సనీస దా,ని ప పమాప గ గామరి రీసా రిసా

స నీ దా పా మా రీ సా

రెండవఅవరోహణ స నిసనీ ద,ని ప మపమా గ గామా రీసా
న నీ దా ప మా గ రీ సా.

రాగరంజక ప్రయోగాలతో సంక్షిప్తరాగాలాపన.

సారీమాపామాగాగామరిరీ రీమరీసా । సనిపధాసారిగానరీ రిమపదాపమపమాగ గామగగ రీరిమరీసా । సారీపామ పాదసనీదా ధానిద పదాసనిదపా పాదప మగ గామగరీ । సారిగాగాగామపాదపమపమాగగామ రిరీ సారీ రిమపదా;దనిసారి సనిసనీదా దపాదసనిదప పాదపమా;పాదసా నీదదానిదప పాదపమా పాదమవ దారిసన దపా, మాపాదాసారిగరీసా స నిపదాసామాపాదసదాపా పాదపమగ గామగ్గ రీన సారీ రీదాప పపమగ గా మగగరీ; సారిమరిమరీసా । సనిపాధాసా;. ।

యదుకుల కాంభోజిలోని శ్యామశాస్త్రివారి స్వరజతి ఒక రత్నం. అది పాఠం చేస్తే యదుకుల కాంభోజిరాగం చక్కగా అవగాహన అవుతుంది. ఈ స్వరజతి లక్ష్యప్ర బంధం. ఒక రసగుళిక.

రచనలు

1. కామాక్షి చాపు శ్యామశాస్త్రి;
2. హెచ్చరికగా ఝంప త్యాగరాజు
3. శ్రీరామ జయరామ " "
4. లలితేమాంపాహి రూపకం చంగల్వరాయశాస్త్రి.
5. చెలిమిని జలజాక్షు ఆది త్యాగరాజు
6. ఎంతనుచుసైరింతు ఆది త్యాగరాజు
7. ఏతావున నేర్చితివో " "
8. అడువారమెల్ల చాపు "
9. నీదయచే రామ ఆది "
10. దయసేయవయ్యా " "

# యమునాకళ్యాణి

యమునాకళ్యాణి 65మేళకర్త మేచకల్యాణి జన్యం.

మూర్ఛన

ఆరోహణ నిరిగమదనిసా

అవరోహణ సనిదపమగమగారిసా సనిదపమపమగరిస

స్వరస్థానాలు స,ప,గాక, చరి;అంగా;ప్రమ;చద్రై; కాని. శు.మ అన్యస్వరం భాషాంగరాగం.

ఇది ప్రయోగప్రధానరాగం. మూర్ఛనప్రకారం పాడినంత మాత్రాన రాగస్వరూపం పూర్తిగా వ్యక్తం అవదు.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | మ | ప | . | ద | . | ని | స |

కొంతమంది శాస్త్రకారుల ప్రకారం అన్యస్వరం అయినశుద్ధమధ్యమం మూర్ఛనలో లేదు. ప్రయోగాలలో ఉంది. ప్రయోగరాగాలకి మూర్ఛనని నిర్ణయించడం ఇబ్బంది. ఏదో ఒక మూర్ఛనుండాలి కనుక నిర్ణయించడం తప్ప నిజానికి దానిపల్ల ప్రయోజనం అంతగా ఉండదు. ప్రయోగాలు అన్నిరాస్తేనే రాగం గురించి సరియైన అభిప్రాయం వస్తుంది ఆరాగంలో గల కృతులు, వర్ణాలలోగల ప్రయోగాలను ఎత్తి చూపిస్తే ప్రయోజనం చక్కగా ఉంటుంది.

యమునాకళ్యాణి లోగల జావళి 'అదినీపైమరలుకొన్నది'. దీనిలోని ప్రయోగాలు ఇతర కృతులలో ప్రయోగాలతో సంక్షిప్తరాగాలాపన

నిరిగపమమగరిస్థా సనిపదసా నిరిగాగాగ్గారిగమపామగమరిగా గరిసన్దిదా నిరీదాసా గమదపమాగరీసనిదనీదా నిరీనిరిగారిరిగమపామ గమరిగారి గగరిసనిదనిరిదసా పాగమాపాపా మపా దాదాని మగనిసాని దపమ మా;; గ గాగారీరిగమపారీ గరిగపమ మగరీసా సనిదానీసా నీదానిరీ దదపమ గాపాపా; పమదాదాదా మదనిసానిదపమగా, మాగారీరి సనిదా నీరీరీ పమదీ సాసా నిదనిరీదాసా.

ఉత్తరాంగంలో ప్రయోగాలుతక్కువ. పూర్వాంగప్రధానరాగం. అనుమపేత మధ్య తిలోపాడితే చాలారక్తిగా ఉంటుంది.

ఈ రాగ మండలనిడివి (Range) మంద్రపంచమంనుండి తారషడ్జమంతో ఆధా ప్రయోగాలన్ని మంద్రపంచమం నుండి మధ్యధైవతం వరకు ఎక్కువగా ఉంటాయి. ధం తారషడ్జమం స్పృశించి వెనక్కిరావడమే పరిపాటి. ఈరాగంలో స,ప,రి,గ,ధ,నిలు ఖ్యమైన జీవస్వరాలు. శుమ;ప్రమ . స్వరాలుకూడా జీవస్వరాలే. మొత్తంమీద అన్ని స్వరాలే 'సానిదపమగా "అనే ప్రయోగంలో దిగుజారుగమకం చాలాహాయిగా ఉంటి ములాకళ్యాణికి పతాకప్రయోగంగా ఉంటుంది. "దనిరి " "నిరిగ" అనేప్రయోగాలు । పదసా" అనేప్రయోగం చాలా అందంగా ఉండి, రాగభావాన్ని ఇనుమడిస్తాయి. మా మాగా" అనే వరుస స్వరస్థానాలు జోరుగాపాడితే ఆకర్షణీయంగా కొంచెంతేలికగా ౨ లలితంగా ఆకర్షణీయంగా ఉంటుంది. రాగాలాపన కొంచెంసేపు చేయవచ్చు. ్న మనోధర్మగానాంశాలు ఈ రాగంలో బాగుండవు. ఇది దేశీయ రాగం కనుక. మునా కళ్యాణి అనగా యమునా ,తీరప్రాంత ప్రజలలో ప్రచారంలో ఉండేమన ్యాణికి పోలినరాగం కనుక ఆపేరు మన పూర్వులే పెట్టారు. హిందూస్థానీ గీతంలో యమన్ అంటారు. ఆ యమున్‌కి 'కళ్యాణి' అని పదాన్ని చేర్చి దాన్ని చెం లలితంగా రూపొందించి మనవాళ్ళు యమునా కళ్యాణి అని పిలవటం ందలు పెట్టారు. ఈ రాగంలో జావళీలు; కొన్ని భజనకృతులు, బృందగానాలకి ంపోయే సాంఘిక, దేశభక్తి గేయాలు బాగుంటాయి. కచ్చేరీ చివరి భాగంలో డవలసినరాగం.

చనలు

ఆది నీపైమరులు కొన్నిదిరా. ఆదితాళం జావళి

. హరిదాసులు " త్యాగరాజు

. భావయేపవమాననందనం " రామదాసు.

ఇందు జన్యరాగాలు

1. కలహంస సరిమపదనిస సనిదనిపమగరిస
2. నాగగంధర్వం సరిమపదనిస సదనిపమరిస
3. హిందోళకన్నడ సగమదనిస సనిపదమగస.

# యాగప్రియ (కలావతి)

యాగప్రియ 31వ మేళకర్త 6వ ఋతుచక్రంలో మొదటి మేళకర్త 'ప' ప్రస్థారం సంపూర్ణం.

స్వరస్థానాలు స,ప,గాక షరి, అంగా, శుమ, శుధై, శుని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | రి | గ | మ | . | ప | ద | ని | . | . | స |

పూర్వాంగంలో రిగలు అతి తీవ్రాలు, ఉత్తరాంగంలో దనిలు అతికోమలాలు. ఈ రాగాన్ని పాడటం చాలాకష్టం. చాలా సాధన చేయాలి.

పూర్వాంగం నాటస్వరాలు, ఉత్తరాంగం కనకాంగి స్వరాలు ఈ మేళంరాగం కాదు కాలేదు కూడాను. ఇది వివాది మయం. పూర్వాంగంలో రి, ఉత్తరాంగలో ని, వివాదిస్వరాలు. షట్స్రురిషభం అంటే సాధారణ గాంధారమే, సాధారణగాంధారం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం వరుస స్వరాలు కనుకనే పాడటం కష్టం.ఉత్తరాంగంలో ల శుద్ధనిషాధం అంటే చతుశృతిరిషభమై వరుసగా శుద్ధధైవతం, చతుశృతిధైవతాన్ని పాడటం కూడా కష్టమే. ఈ వివాదిరాగంలో సంగీతవిలువలు తక్కువ ఉంటాయి. ఒకప్పుడు అసలు ఉండవు. వివాదిత్వం అంటే ఆదీ అర్థం.

వేంకటమఖి సాంప్రదాయంలో ఈరాగానికి కలావతిఅని పేరు. మూర్ఛన సారిగమపదనిపదసా సనీదపమరిగమరిస రాగాంగం. సంపూర్ణం, షడ్జగ్రహం, ఎల్లప్పూడును గానముసేయదగును.

రచనలు

1. లక్ష్యగీతం అరేక్రూరదానవ ఝంప వెంకటముఖి
2. చిట్టితానం
3. కళావతీ కమలానన యువతీ ఆది దీక్షితర్
4. సంచారి మత్య సుబ్బరామదీక్షితర్ ఇది మూర్ఛనకారకమేళం కాదు.

# 42.రఘుప్రియ. (రవిక్రియ)

రఘుప్రియ 42వ మేళం 7వ ఋషి చక్రమునందు ఆరవ రాగం 'ష'ప్రస్తారం. సంపూర్ణం. వివాదిరాగం.

పూర్వాంగంలోనూ ఉత్తరాంగంలోనూ కూడా వివాదిస్వరాలు శుగ,షధై, ఉన్నాయి స్వరస్థానాలు స, ప, గాక, శురి, శుగ, ప్రమ, షధై, కాని,

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | . | మ | ప | . | . | ద | ని | స |

పూర్వాంగంలో రిగ అతి కోమలం,

ఉత్తరాగంగంలో ద, ని, అది తీవ్రాలు.

పమగామపాదాప । నిసరిరిసా । సరినిసా । పదమపాగమా । గాసరిసా ।

అన్యప్రయోగాలు పాడితే వివాదితల తగ్గుతుంది. ఈరాగం పాడుట కష్టతరం.

వేంకటమఖి వారి సంప్రదాయప్రదర్శిని ప్రకారం ఈ రాగం రవిక్రియ

మూర్ఛన

స రి గ మ ప ని ద ని స ఆరో

స ని ప ప మ గా రి రి స అవ

ఎల్లప్పుడు పాడదగును. రాగాంగం, సంపూర్ణం, షడ్జగ్రహం,

రచనలు

1. లక్ష్యగీతం. అరేరాగనాయక ఝంప వేకటముఖి
2. కృతి హిమగిరికుమారి ఆది దీక్షితర్
3. సంచారి రూపకం సబ్బరాయదీక్షితర్

జన్యరాగాలు

| | | |
|---|---|---|
| 1. | రఘులీల | సమరిపమగమపమరిమపనిస । సనిదనిపమగగమరిమగరిస |
| 2. | ఇందు కీర్వాణి | సరిగమపస । సనిపదనిపమగరి |
| 3. | గంధర్వము | మపదనిసరిగరిస । నిపమపదనిస |
| 4. | హంసహేలావళి | సరిగమపదనిస । సనిపమగరిస |
| 5. | గోమతి | సరిగమపదని । పమరిగరిస |
| 6. | ఆనందభోగి | సరిగమపనిదని । దపమగరిసనిస |

# రంజని

రంజని 59వ మేళకర్త ధర్మవతి జన్యం.

మూర్ఛన
ఆరోహణ  స రి గ మ ద సా
అవరోహణ  స ని ద మ గ స రి స

స్వరస్థానాలు షడ్జమం, చరి ; సాగా ; ప్రమ ; చద్రై ; కాని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | . | మ | . | . | ద | . | ని | స |

ఉపాంగం రక్తిరాగం, వర్జ్యరాగం. ఆరోహణలో పంచమనిషాదాలు లే అవరోహణలో పంచమంలేదు.

ఔడవ వక్రషాడవ రాగం. ప్రతిమధ్యమరాగాల్లో ముఖ్యమైన ఆకర్షణీయమైన రాగం. త్యాగరాజస్వామి ఈరాగాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చా ఈరాగం పాడటంకష్టం; గ, మ, ద, ని, లు దూరంగా ఉండటంచే త్యాగరాజస్వామి దుర్మార్గచరాధముల దొరనీవనజాలరా " అనేకీర్తన రచించార తరువాత వాగ్గేయకారులు ఒకటి రెండు కీర్తనలు దీనిలో రచించారు ఈరాగ బాగా ప్రచారంలోకి ఏభై ఏండ్ల క్రితం వచ్చింది.

గమకంగా మూర్ఛన
ఆరోహణ  సరిగా గమా మానిదా, దసా,
నరి గా మా దా, సా.
అవరోహణ  ససని నిద దమ మగ గస రి స
సని. ద. మ. గ స రి
వాది  స.
సంవాదులు రి ద; మ ని;
అన్నిస్వరాలు జీవస్వరాలు
గహన్యాసాలు స . రి . గ , ద . మ . ని

'ని' గ్రహన్యాసస్వరంకాదు చాలా రంజకంగా ఉంటుంది కాబట్టి ఈ రాగానికి రంజని అనిపేరు పెట్టారు. వీరరస ప్రధానమైనది నిర్దుష్టమైనరూపంకలది. మంద్రధైవతంనుండి తార మధ్యమంవరకు, మధ్య ధ్రుతకాలాల్లో పాడితే ఈరాగం బాగుంటుంది. కచ్చేరిలో ప్రముఖ్యరాగంగా రాణిస్తుంది, రాగాలాపన, స్వరకల్పన నెరవు, తానం పల్లవి కూడా పాడవచ్చు పెద్దరాగం కాకపోయినా పెద్దరాగం అంతరాగం.

సంక్షిప్తరాగాలాపన.

సా రీగాసా రీసారిసనిధా । ధసరిగమరీ । ;; దసరిగసరీ ;; । సారిరిసనిధా ।
ధా సామాసధాసా । రీగరీగసారీ । సనిధసరిగసరీ । గాసా ।
రిసనిధా । దాసారీగా మా గాసా । గామదామగాగాసా । గమదమమగగాగగమదా ।
దాదానీమాదాగా । మాసా । సరిగమద గమా దానిమా నిదసా । సనినిదాదామదాసా
మామాదదాసా । సారిసనిదాసారీ । దారిరిససనినిదదా మదనీదసరీ । దసరిగసరీస ।
సనిదాదాసరిగామాగాసా । సరిగసరీసనిదా । దాసాదమగా । గమదనీదమాగా ।
గమదామగా । గమమగసా । సరిగాసరీస । రిససనినిదాదదసా ।

రచనలు

1.దుర్మార్గచరా రూపకం త్యాగరాజు

2.రంజని నిరంజని జి. ఎన్. బి.

# రత్నాంగి ఫేనద్యుతి.

రత్నాంగి 1.వ ఇందు చక్రంలో శ్రీప్రస్థారం కలిగిన రెండవ మేళకర్త. రత్నాంగి అనేపేరులో ర అక్షం 2వ అంకెను న అక్షరం సున్నను కటపయాది సూత్రం ప్రకారం చెపుతుంది. సంపూర్ణం

స్వరస్థానాలు - స, రి, గ, మ, ప, ద, ని.

స, ప, గాక - శురి, శుగ, శు, శుద్రై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | . | . | మ | . | ప | ద | . | ని | . | స |

ఇది వివాది మేళం(రాగం) శుద్ధగాంధారం ఉంది గనుక

పూర్వాగంకనకాంగి, ఉత్తరాంగం తోడి

దీనికే వేంకటమఖివారు ఇచ్చిన పేరు ఫేనద్యుతి.

ఫ = 2 ; న = 0 = (02). 2 వ మేళం

స ని ద ప మ గమ । స రి స ని సా ।

ప ద ని స రి స । మ గ మ స రి స ।

అని పాడితేవివాది (కష్టం) దోషం తొలగుతుంది సుకరం అవుతుంది. ఇ మూర్ఛనకారక మేళం.

1) 'రి' గ్రహంచేస్తే 53వ .మేళం అవుతుంది.

2.) మ గ్రహం చేస్తే 19వ .మేళం అవుతుంది.

ఈ మేళంలో జన్యాలు

1. పుష్పవసంతం - సరిగపమపదనిస _ సదనిపమగరిస .

2. శ్రీమణి - సరిగపదస —— సనిదపగరిస

3. ఘంటారావము - సగమపనిస — సనిదపమగరిస.

ఫేనద్యుతి అసంపూర్ణమేళం. - సమపదనిస — సనిదమగరి

రచనలు

1. లక్ష్యగీతం. (లక్షణగీతం) మఠ్యతాళం వేంకటముఖి.
2. చిట్టతానము - వేంకటముఖి
3. కీర్తనము - శ్రీదక్షిణామూర్తిమీశం. ఆది దీక్షితర్
4. సంచారి - మఠ్యతాళం - సుబ్బరామ దీక్షితర్.

# రమామనోహరి

రమామనోహరి 52వ మేళకర్త రామప్రియ జన్యం

ఆరోహణ స గ మ ప ని స

అవరోహణ స ని ద ప మ గ స

స్వస్థానాలు స, ప, గాక, అంగా, ప్రమ, చద్రై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | . | గ | . | మ | ప | . | ద | ని | . | స |

ఉపాంగరాగం జౌడవ షాడవం వేంకటముఖి సంప్రదాయంలో 52వ మేళానికి రమామనోహరి లేక రామమనోహరి అనిపేరు. ఇది సంపూర్ణమేళం.

త్యాగరాజస్వామి బహుశః ఆపేరుతోనే ఈరాగాన్ని పాడుకొని దానియందు రచన చేసి ఉంటారు. ఈ రాగమందు ఇతర వాగ్గేయ కారులు రచనలు కనిపించుటలేదు. ఈరాగము త్యాగయ్యవారి సృష్టియేకావచ్చును. అపూర్వరాగం అయినా, ఈరాగం,స్వరకల్పన, విరివిగా, సులభంగా పాడటానికి అవకాశలు ఉన్న రాగం.

సంక్షిప్తరాగాలాపన

సా । సగమపమగాసా । సానిదపసనిసా । నిసగా । సగమా। మపమగా మగసా గమపా । నిదపమ । గమపనిదపమ । పనిదపమ । దపమ । గమగసగమాప । నిదపనిసా । నిదప । పనిసనిదప । పసనిదప । నిదపమ । పపమగమగా । గమపనిసగా । మగసానిదపా । మగసా । గమపనిసానిదపమగ । గమపమగమగసా । మగసగాన । నిసనిదపనిసా ।

రచన •

శాంతామనోహర రామ ఆది త్యాగరాజస్వామి.

# రవిచంద్రిక

28వ మేళకర్త హరికాంభోజి జన్యం

మూర్ఛన

ఆరోహణ స రి గ మ ద సં

అవరోహణ సం ని ద మ గ రి స

స్వరస్థానాలు స, ప గాక , చరి, అంగా; శుమ;చధై;కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | మ | . | . | . | ద | ని | . | సం |

ఉపాంగం, వర్జ్యంరాగం. ఆరోహణలో ప, ని లేవు.

అవరోహణలో 'ప' లేదు.

రాగం, స్వరం పాడవచ్చు రక్తిరాగాల్లో రెండవతరహాకి చెందినది. ఆకర్షణీయమైనరాగం. కొంచెంసేపుమాత్రం రాగం, స్వలరకల్పన పాడవచ్చు. శృంగారరస ప్రధానం

వాది స.

సంవాదులు స-మ ; రి-ద; గ-ద ; మ-ని ; మ-సం. ప-సం.

జీవ స్వరాలు స, మ, ని, ద .

గ్రహన్యాసస్వరాలు ; స, మ, ద.

మూర్ఛననుబట్టే కృతిలో ఉండేప్రయోగాలు ఆధారంగా రాగం స్వరం పాడవచ్చు. రెండుస్థాయిల్లో మధ్య దురిత కాలాల్లో రాగం పాడవచ్చు.

రచనలు

1. నిరవధిసుఖదా - ఆది త్యాగరాజు
2. మాకేలరా విచారము "

# రసాళి (వనాళి)

రసాళి 4వ మేళకర్త వనస్పతి జన్యం.

ఆరోహణ స రి మ ప ద ని సं

అవరోహణ సं ద ప మ రి స

స్వరస్థానాలు స, ప, లుగాక ,శురి, శుమ, చద్వైకైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | . | మ | . | ప | . | ద | ని | . | సं |

ఈరాగంలో గాంధారం లేదుగనుక ఈరాగం చక్రవాకం జన్యంగాని లేక నాట క్రప్రియజన్యంగా గాని అనవచ్చు. ఈ రసాళి రాగన్ని వనస్పతి జన్యంగా ఎవరు ఎందుకు నిర్ణయించారో తెలియదు. ఇది అసమంజసం.

ఈరాగం అందంగా ఉంటుంది. భావంగా పాడవచ్చు. ఉపాంగరాగం, షాడవ జౌడవరాగం. అపూర్వరాగం అయినా రక్తిరాగం. రాగం, స్వరకల్పన నెరవు కూడా పాడవచ్చు. ఈరాగనికి రెండుపేర్లు ఉన్నాయి. రసాళి, వనాళి.

సంక్షిప్తరాగాలాపన

స్థా । పధ్పప్పధనిసరీసా । సారిమరీసా । రిమపామరిస । ధ్పధ్నిసరిమ సరిమారిసా । సాదాపామా । దదపమరిస । మమరిసధ్పా । ధ్ని సరిమా రిమ పమరీసా ।

ఈరాగం శ్రీత్యాగరాజస్వామి వారి సృష్టియే అనాలి. కృతిని బట్టి రాగం ొక్క నడకలు తెలుస్తాయి. ఈరాగంలో ఒక్క కృతి మాత్రం కన్పిస్తోంది.

రచనలు –

అపరాధముల నోర్వ ఆది త్యాగరాజస్వామి.

# రసికప్రియ (రసమంజరి)

రసికప్రియ 72వ మేళకర్త 12వ ఆదిత్యచక్రంలో 6వరాగం. 'ష' ప్రస్థారం సం పూర్ణం వివాదిరాగం.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | రి | గ | . | మ | ప | . | . | ద | ని | స |

మూర్చనలో షరి, షద్రై. ఉన్నాయి కనుక వివాది రాగం.

వాది స

సంవాదులు స – ప; రి – ద; గ – ని; మ – ని; ప - స

పాడటం కష్టం అయినా అందంగా ఉంటుంది సాధించి పాడవచ్చు.

సారీసా । రీగా । గరిగా । మపమగా । మపదాప । పమగమగా । మగారి సరీసా । గారిగమపా । దాప । మపదాప । పదనీసా । సానిదాపాదామప । గమాగరిగారిసరీసా । సనిధాప । పధానిసారిసా ।

ఈప్రయోగాలు పాడాలి

పూర్వాంగ ఉత్తరాంగాలకు సమమైత్రి ఉన్నది

స . . రి గ

ప . . ద ని

వేంకటమఖి సంప్రదాయమున ఈరాగం రసమంజరి. షడ్జగ్రహం రాగాంగం సంపూర్ణం ఎల్లప్పుడును గానము సేయుదగును

రచనలు

1.లక్ష్యగీతం - శృతిద్వావింశతీ ఝంప వేంకటముఖి

2.కృతి శృంగారరసమంజరీ త్రిస ఏక దీక్షితర్

3.సంచారి మర్త్య సబ్బురామదీక్షితర్

ఈరాగ గ గ్రహంచేసిన, 57వ మేళం సింహేంద్రమధ్యమము
" ని " 15 " మాయామాళవగౌళ వచ్చును.

ఇందు జన్యరాగము. కనుకజ్యోతిష్మతి స మ ప ద ని స|స ని ద ప మ స

# రాగవర్ధని (రాగచుడామణి)

రాగవర్ధని 32వ మేళకర్త 6వ రుతు చక్రంలో రెండవరాగం శ్రీప్రస్తారం, సంపూర్ణం.

స్వరస్థానాలు స,ప,గాక, షరి, అంగా, శుమ, శుధై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | . | రి | గ | మ | . | ప | ద | . | ని | . | స |

పూర్వాంగం నాట, ఉత్తరాంగం తోడి స్వరాలను కలిగియున్న మేళం. వివాదిరాగం.

గమపదనిసా । సరీస । పదనిసరీస । గమపదపమగమ । సరీస । నిసరిరిసా । సనిధపనిసా । అనిపాడితే వివాదిత్వం తగ్గుతుంది పాడటం సులభం. వినేవారికి కూడా శ్రావ్యంగా ఉంటుంది

దీని మధ్యమం గ్రహం చేస్తే 24వ మేళకర్త వరుణప్రియవస్తుంది వేంకటమఖివారివారి సంప్రదాయంలో ఈరాగానికి 'రాగచూడామణి' అనిపేరు.

మూర్ఛన

సామరిగమపపనిసాసా

సానిదపమమరిస.రాగంగ సంపూర్ణం షడ్జగ్రహం ఎల్లప్పుడు ను గానముసేయదగును.

రచనలు

లక్ష్యగీతం - రూపకలుషిత, రగణమర్త్య వెంకటముఖి

2.తానము

3.కీర్తన - శ్వేతగణపతిం వందే త్రిపుట దీక్షితర్

4. సంచారి - ధృవ తాళం సుబ్బరామదీక్షితర్

జన్యరాగలు

1.రాగచ్చూడామణి - సరిగమపనిస । సనిదపమరిస

2.సామంతజింగ్లా - సరిగమపదనిస । సనిపదనిపమగరమరిస

3.హిందోళకాపీ - సరిగమపమపస ।సనిదపమరిస

4.హిందోళదర్బారు - సగమపస । సనిదపమరిస

5.హిందోళసారంగ - సరిగమపసనిస । సనిదపనిదమగమరిస.

# రాగపంజరం

రాగపంజరం 28 వ మేళకర్త హరికాంభోజి జన్యం

మూర్ఛన

ఆరోహణ సరిమపనిదస

అవరోహణ సనిదమరిస

స్వరస్థానాలు స, ప, గాక, చరి, శుమ, చధై, కైని.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | మ | . | ప | . | ద | ని | . | స |

ఉపాంగరాగం అపూర్వరాగం, రక్తిరాగం, చిన్నరాగం,వర్జ్యరాగం, గాంధారం వర్జ్యం అవరోహణలో పంచమం వర్జ్యం. వక్రషాడవ ఔడవరాగం

ఈరాగం త్యాగరాజస్వామి వారు సృష్టించినదే ప్రయత్నం చేస్తే రాగం స్వరకల్పన పాడవచ్చు కొద్దిసేపు

వాది. స.

గ్రహస్వరం స.

జీవస్వరాలు స రి మ ప ద ని

నిషాధం న్యాయస్వరంకాదు.

రచనలు

1. వందానవనీతాశ పాహి చాపు
2. సార్వభౌమసాకేత రామ ఆది

# రామప్రియ (రమామనోహరి)

రామప్రియ 52వ మేళకర్త. 9 వ బ్రహ్మచక్రంలో 4.వరాగం.భూ ప్రస్తారం సంపూర్ణం.

స్వరస్థానాలు స,ప,గాక, శురి, అంగా, ప్రమ, చద్రై, కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | . | మ | ప | . | ధ | ని | . | ṡ |

పూర్వాంగం (రిగమ) కామవర్ధని ఉత్తరాంగం (ధని) ఖరహరప్రియ స్వరాలు కలిగి ఉంది.

పూర్వాంగ ఉత్తరాగంలు కలిపి నిడివి సంగతులతో ఈరాగాన్ని పాడితే రక్తిగా ఉంటుంది.

అన్ని గ్రహ, న్యాస, స్వరములే, వాది స. సంవాదులు జీస్వరములు ప్రసిద్ధిరాగాలకు, రక్తిరాగాలకుకు మాత్రమే ఉంటాయి.

వేంకటముఖివారి సంప్రదాయంలో ఈరాగం రమామనోహరి

మూర్ఛన

స రి గ మ ప ద ని

ṡ ని ద ప మ గ రి స

రాగాంగం సంపూర్ణం, షడ్జగ్రహం, ఎల్లప్పుడు గానముసేయదగును పదసా, పానినిస, పరిసనిప, సనిపమగరిసా ఇవి విశేషప్రయోగములు అని సంప్రదాయ ప్రదర్శనిలో ఉన్నది.

రచనలు

1. లక్ష్యగీతం అరేరణవీర ఝంప, వెంకటముఖి.
2. కృతి శ్రీరాజరాజేశ్వరి. అదితాళం. పొన్నయ్య
3. సంచారి. త్రిపుట సుబ్బరాయదీక్షితర్

## కొన్ని జన్యరాగమూర్ఛనలు

1 .రమామనోహరి  సరిగమపదనిస । సనిదపమగరిస
2. కళాభరణం  సగరిగమపనిదని । దపమగరిసనిస
3. జటాధరి  సగరిమపదనిస । సనిదపగరిస
4. తపస్విని  సగమపనిస । సనిదపమగస

# రిషభప్రియ (రతిప్రియ)

రిషభప్రియ 62వ మేళకర్త 11వ రుద్రచక్రం లో 2వ మేళం శ్రీప్రస్థారం ంపూర్ణం .

స్వరస్థానాలు స, ప. గాక. చరి అంగా. ప్రమ శుద్ధై, కైని

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | . | గ | . . | మ | ప | ద | . | ని | . | స |

పూర్వాంగం కళ్యాణి స్వరాలు ఉత్తారాంగం తోడిస్వరాలు ఈ మేళంలో న్నాయి

పూర్వాంగ ఉత్తరాంగాలు కలిపిపాడాలి,

ఇది ఈనాటివరకు ప్రసిద్ధరాగం కాకపోయినా ఏనాటికైనా ప్రసిద్ధం కావడం న్యం. మహిమ దక్కించుకోవయ్యా అనే త్యాగరాజస్వామివారి కృతి ద్వారా ఈరాగం సిద్ధం కావడానికి ప్రారంభం అయింది.

వాది, గ్రహస్వరం స

సంవాదులు స – ప ; రి – ప ; ప – స

పాదనిదపమగరీ । సరిగారిసనిదసాద । దనిసా । గమపాపదనీదనీదపమ ।
మపదానిసా । రీగారిరీ । సరిసనీద నీదపమ । పమగారిగారిసా, । సారిగా
పనిదనీద । దనిసా । ఈ ప్రయోగాలు ముఖ్యంగా పాడాలి.

వేంకటముఖి సంప్రదాయంలో ఈరాగం 'రతిప్రియ' రాగాంగం సంపూర్ణం షడ్జ పంచమం ఎల్లప్పుడును పాడవచ్చును.

మూర్ఛన

స రి గ మ ప ద ని స

స ని ద ప మ గ రి సా

రచనలు

1.లక్ష్యగీతం కృపాకరి, త్రిపుట వేంకటముఖి

2.కృతి మారరతిప్రియ ఆది ముద్దుస్వామి దీక్షితర్

3.సంచారి మఠ్య సుబ్బరాయ దీక్షితర్

ఈరాగం యొక్క ప గ్రహం చేస్తే 11వ మేళం కోకిల ప్రియ వస్తుం

ఇందు జన్యంరాగమూర్ఛనలు

1.రత్నభాను సరిమగరిమపనిదనిస సనిదపమగరిస

2.కనకనాసామణి. సరిగరిమపదనిస సనిదపమగరిస

3.రుచిరమణి సగమపదనిదస సదపమగరిస

4.విజయగోత్రారి సరిగమపదనిస సనిదపమగారిస

5.శుద్ధసారంగ సగమపనిస సదపమగరిస.

# రీతిగౌళ

రీతిగౌళ 22వ మేళకర్త ఖరహరప్రియ జన్యం. ఒకప్పుడు ఈ రాగం 20వ మేళకర్త జన్యంగా వాడుకలో ఉందని లక్షణగ్రంథాల్లో ఉన్నది. కాని ప్రస్తుతం లక్ష్యం మారింది కనుక లక్షణం కూడా మారాలి ; మారింది.

ఉపాంగ రాగం అపురూప రాగం, కోమలమై, పాండితీ ప్రతిభకు ఆలవాలమైన రాగం. నిర్దుష్టమైన రూప, రసాలుకలిగిన రాగం. భక్తి రసప్రధానమైన రాగం. స్వరస్థానములు స, ప, గాక, చరి, సాగా ; శుమ ; చద్రై ; కైని.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | . | రి | గ | . | మ | . | ప | . | ద | ని | . | స |

మూర్ఛన

ఆరోహణ 1. స గ రి గ మ ని ద మ ని ని సా

2. స గ రి గ మ ని ని సా

అవరోహణ 1. స ని ద మ గ మ ప మ గ రి స

2. స ని ద మ గ రి స

పంచమం (అరుదుగా ప్రయోగించబడుతుంది) అల్పం.

పంచమప్రయోగాలు పమగరిసా ॥ గమపామాగారిసా । సనిపనినిసా । సనిపాపానిదమ । పంచమప్రయోగాలలో అపురూపప్రయోగాలు పాదదమగమా । పానిదమా । పాసానిదమా । పగరిసనిదమా । పరిసనిదమా

నీదమా అన్నప్రయోగంలో 'ద' దుర్బలస్వరం. అనగా నీనిదమా అనిపలుకుతుంది ఆవిధంగానే, గారిసా అన్నేప్రయోగంలో రిషభం దుర్బలం అనగా గాగరిసా అనిపలుకుతుంది.

రిషభ ధైవతాలు కొన్ని సందర్భాలలో దుర్బల స్వరాలు. రి, ద, లు గ్రహన్యాసాలుకావు. గ్రహన్యాసాలు స ; మ ; ప ; స.

మూర్ఛనలో నిని జంటస్వరము ఉండుట ఈ రాగం విశేషం. గగమా నినిసా అన్నవి సమానప్రయోగములు

జీవస్వరములు గ, మ, ని,

వాదిస్వరం స.

గ్రహస్వరం స.

సంవాదులు స ప ; రి ద ; గ ని ; మ స ; మ ని ; ప స .

ఉభయవక్రషాడవ సంపూర్ణ రాగం.

ఈ రాగముయొక్కనిడివి మంద్ర మధ్యమము వద్దనుండి తారపంచమము వరకు కలదు.

రాగాలాపన, స్వరకల్పన, పాడుటకు చాలా అనుకూలమైన రాగం. రక్తిరాగం. తగుమాత్రంగా పాడుటకు అనువైన చిన్న రాగం.

వర్జ్యరాగం, వక్రరాగం, వక్రషాడవ, సంపూర్ణరాగం.

రాగరంజక ప్రయోగములతో సంక్షిప్తరాగాలాపన.

గమగారిసా నిపనినిసా । ససనినీదమా । నినిసా । నిగారిగా । నిసగగమా ।
గమపామగారిసా । నిసగరిసా । గరిసనినీ నిసనినీదమా । నినిసానిసా । గగమాగారీ
నిసగగమా । గమనిదమా । నినిసా । నిసనినిప । నినిసా నిసగరిరిసా । నిసగగమా।
గమగగారిసా । సనిరిసనిదపదనీదామా । నిదమా । గమాపానిదమా ।
గమపామగారిసా । నిసగరిసా । సనిరిసనిదమనినిసానిగారిసా ।

రచనలు

1. అటతాళవర్ణం వనజాక్షి.
2. జననీ చాపు సుబ్బరాయశాస్త్రి
3. నన్ను విడచి కదలకురా చాపు త్యాగరాజు
4. రాగరత్నమాలికచే రూపకం "
5. ద్వైతము సుఖమా ఆది "
6. తత్వమరియతరమా " శివన్.

# రూపవతి

రూపవతి 72వ మేళకర్త పథకమునందు 12వ మేళకర్త రెండవ నేత్ర చక్రమునందు ఆరవ మేళరాగము. షట్పస్థానము.

స్వరస్థానములు.

స, ప, గాక, శురి, సాగా, శుమ, షద్రై, కాని.

| స | రి | . | గ | . | మ | . | ప | . | . | ద | . ని | స |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

ఇందు షట్శృతి ధైవతము ఉండుటచే దీనిని వివాదిరాగము అందురు.

పూర్వాంగము తోడి, ఉత్తరాంగము నాట అనుకొని, స్వరస్థానములను స్వాధీనము చేసుకొని సాధకము చేసిన పాడుట సులభము.

వివాదిత్వము పోవుటకు, దీనిని ప్రత్యేకరూపము నిచ్చి పాడుటకు పూర్వాంగ ఉత్తరాంగ స్వరములు కలుపుచు, షద్రై, కాని, స్వరములు విడివిడిగాను కలిపినప్పుడు ధైవతము దీర్ఘముగా ఒడిసిపట్టుచుపాడవలెను.

ఉదాహరణకు

సానిదాప । పాపదనిసా । పదపనిసా । సరిగమగామపా । దాపమగా । గమపదాప । పదాపనిస । పపదనీసా । నిసరిగమగారిస । సానిపదాప । పమగా గపమగారి సనిపదాపనిసా

వేంకటమఖి సంప్రదాయమున కూడా ఈ రాగమును రూపవతి అందురు. అసంపూర్ణ మేళకర్త.

మూర్ఛన

సరిమపసా సనిదనిపమగస

రచనలు

1. గీతము రమణీయాకృతి ఏక వేంకటముఖి.
2. తానము "
3. కృతి శ్రీకృష్ణం భజరే త్రిసఏక ముద్దుస్వామిదీక్షితర్
4. సంచారి ఆది సుబ్బరామదీక్షితర్.

జన్యరాగాలు

1. రౌప్యనగము సమపదనిస సదనిపమగరిస
2. ప్రతాపవసంతము సమరిగమపనిస సనిపమరిస
3. పూర్ణస్వరావళి సగమపదనిస సదనిదపమరిగస
4. భానుకోకిలం సమపదనిస సదనిపమగస
5. భోగవరాళి సరిగమపనిస సనిపమగరిస
6. రేఖావతి సరిగమపనిదస సనిదపమగరిస
7. సామకురంజి సగపదనిస సనిదనిపమగరిస
8. సోమభైరవి సరిగమపస ససాపదనిపమగరిస

# రేగుప్తి

రేవగుప్తి లేక రేగుప్తి 15వ మేళకర్త మాయామాళవగౌళ జన్యం

మూర్ఛన

ఆరోహణ స రి గ ప ద సా

అవరోహణ స ద ప గ రి సా

స్వరస్థానాలు స, ప, గాక, శురి, అంగా, శుధై.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | . | . | గ | . | . | ప | ద | . | . | . | స |

ఉపాంగం వర్జ్యరాగం. మూర్ఛనలో, మ, ని, లేవు. ఔడవం

అపూర్వ రాగం. దీనికి భూపాలానికి 'గ' మాత్రం భేదం. దీనికి 'ని' అవరోహణలో చేరిస్తే భౌళి అవుతుంది.

వాది. స.

సంవాదులు స ప ; రి ద ; ప స.

జీవస్వరాలు రి, గ, ద

గ్రహన్యాసస్వరాలు స, రి, గ, ప, ద.

ఈ రాగం ఆధునిక యుగంలో అంతగా వాడుకలో లేదు చిన్నరాగం. మంచి రాగం. కరుణ భక్తిరసప్రధానమైనది ఉదయరాగం. సాయంకాలరాగం కూడాను.

రచనలు

1. నీవెరగనిదిలేదు ఆది అన్నమాచార్య
2. నదావినతసాదరే రూపకం దీక్షితర్
3. శరణభవగురుగుహం " "
4. గ్రహబలమేమి ఆది త్యాగరాజు.

24/4-94

## About the Author

*'Sangeetha Mahamahopadhyaya'*
**Dr. Nookala Chinna Satyanarayana**
*Principal S.V. Music College, Tirupathi*

**Gurus** : Mother, Mangelampalli Pattabhiramayya garu, Dwaram Venkataswamy Naidu Garu, Dr. Pinakapanigaru.

**Posts Held**

Professor, Vijayanagaram Maharaja's Govt. Music College, Principal, Govt. Music Colleges : Secunderabad, Hyderabad, Vijayawada.

Professor & Head of the Dept. of Music Telugu University, Hyd

**Honours, Titles etc.**

Asthana Vidwan, T.T.D. Tirupati, S. V. Devasthanam, Pittsburgh, USA.
KanchiKamakoti Asthanam, Sangeetha Nataka Academy award,
Senior fellow of cultural Dept. Govt. of India.

**Member**

S. V. University Academic Senate, S. P. Mahila University Board of Studies.
Madras Music Academy, Chairman Board of Studies in Music, S. V. University.
Top Class Artist of AIR & T.V.

**Titles**

1. Sangeetha Maha Mahopadhyaya, 2. Sangeetha Sudharnava
3. Telugu Velugu, 4. Sangeetha Vidya Sagara, 5. Sangeetha Sudhakara
6. Gandharava Vidya Visaradha, 7. Lakshya Lakshana Marthanda

**Books**

Raga Lakshana Sangraham, Monograph on Tyagaraja's Pancha Ratnas
An Introduction to the Science of Art of Music

**Innovations**

Non Formal Education of Music.

**International Professional Multi Tours**

**To**

USA, Canada, U.K., Malaysia, Singapore